
BSA LADYBIRD
Your best friend for life.
Introducing
BSA LADYBIRD XS
Act Create Play
Push your boundaries and explore new horizons. Because with the all-new Ladybird XS you can go wherever you want to. The perfect combination of stylish, feminine looks and a strong, rugged frame, it's the right companion for girls who believe in having the best of every world.
Bring home a Ladybird XS and bring out the adventurer in you.
www.ticyclesindia.com

3

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com & subscribe now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ............................................................................................

Date of Birth: .................................. Sex :.......................................

Address: .........................................................................................

.......................................................................................................

.......................................................................................................

..................................................... City: ...........................................

State:........................................... Pin:.................................................

Telephone:.......................................................................................

Mobile:.............................................................................................

Email:...............................................................................................

Subscription Number 9(or renewals):..............................................

Gift Subscription to the following address:

.......................................................................................................

.......................................................................................................

.......................................................................................................

.......................................................................................................

Enclosed Cheque/DD* for Rupees...................................................

Cheque/DD No ..............................................................................

favouring Chandamama India Ltd on.............................................

.............................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 48 | Rs. 108 | Rs. 192 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 36 | Rs. 81 | Rs. 144 | Rs. 225 |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

చందమామ సంపుటి: 62 ఫిబ్రవరి 2009 సంచిక:02

## ఈ నెల విశేషాలు

















## ఈ సంచికలో...





## అమరవాణి

భార్యకు చెప్పకూడనివీ, బంధువులకు చెప్పకూడనివీ, స్నేహితులకూ, కుమారులకూ చెప్పకూడనివీ కొన్నికొన్ని ఉంటాయి. ఏది యుక్తమో, ఏది కాదో తెలుసుకుంటూ తెలివిగలవారు పెద్దలు చూపిన దారిలో నడవాలి.

★★★

జింకలు జింకలతోనూ, గోవులు గోవులతోనూ, గుర్రాలు గుర్రాలతోనూ చేరుతాయి. మూర్ఖులు మూర్ఖులతో చేరుతారు. బుద్ధిమంతులు బుద్ధిమంతులతో చేరుతారు. గుణదోషాలు సమంగా ఉంటేనే సఖ్యం సాధ్యం.



# బాధ్యతాయుతమైన పౌరులుగా...

నవంబరు ఇరవై ఆరవ తేదీ ముంబయిలో జరిగిన ఉగ్రవాద దాడులు భారత ప్రజలను దిగ్భ్రాంత పరిచాయి. ప్రజలలో ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. బాధ్యతా రహితంగా, ఉదాసీనంగా వ్యవహరించిన రాజకీయనాయకుల మీద, అధికారుల మీద ఘాటైన విమర్శలు వెల్లువెత్తాయి.

అయితే, ఇక్కడ మనం ఒక ముఖ్యమైన విషయం మరిచి పోకూడదు. రాజకీయనాయకులు ఎక్కడినుంచో వచ్చిన వారుకారు. మనపై అధికారం చెలాయించడానికి ఆకాశం నుంచి ఊడి పడినవారు కారు. మన మధ్య నుంచి వచ్చినవారే. ప్రజాస్వామ్య పద్ధతిలో మన చేత ఎన్నుకో బడినవారే! అలాంటప్పుడు సరైన, సమర్థులైన నాయకులను ఎన్నుకోవడంలో మనం బాధ్యతా యుతమైన పౌరులుగా నడుచుకుంటున్నామా అన్నదే ప్రశ్న!

ఇటీవల జరిగిన ఒక చిన్న విందులో రాజకీయాల గురించి ప్రస్తావన వచ్చింది. ఆతిథ్యమిచ్చిన పెద్దమనిషి అక్కడి వారిని, ''మీ జీవితంలో ఎప్పుడైనా ఓటు వేశారా?'' అని అడిగాడు. ''లేదు, ఒక్కసారి కూడా వేయలేదు,'' అని అందరూ ముక్త కంఠంతో ఎంతో గొప్పగా సమాధానమిచ్చారు. వారందరూ కూడా నలభైలలో, యాభైలలో, అరవైలలో ఉంటూ తల్లిగా, తండ్రిగా, ఉన్నత ఉద్యోగిగా, వ్యాపారిగా తమ తమ పాత్రలను సక్రమంగా పోషిస్తూన్న విద్యావంతులే. అలాంటి వారు ఓటువేసే కనీస బాధ్యతను మాత్రం విస్మరిస్తున్నారు!

దేశపౌరులుగా ఓటువేసి మన బాధ్యతను నిర్వహించినట్టయితే, జవాబుదారీతనంగల మంచి నాయకులను పార్లమెంటుకు పంపే అవకాశం ఏర్పడుతుంది. అలాంటి నాయకులు కట్టు దిట్టమైన వ్యవస్థకు అవసరమైన చట్టాలను రూపొందించి పకట్బందీగా అమలుపరచగలరు. అలా కాకుండా ఓటు వేయడాన్ని ఉదాసీనపరచేవారు, రాజకీయ నాయకులను విమర్శించడం అన్నది బాధ్యతారాహిత్యమే అవుతుంది.

ముంబయి ఉగ్రవాదుల దాడిని విశ్లేషిస్తే–అలాంటి ఘాతుక చర్యలకు పరిష్కార మార్గం వెలుపలి నుంచి రాదు; మనలో నుంచే రావాలి; దాన్ని శోధించి సాధించాలి–అన్న నగ్న సత్యం ప్రస్ఫుట మవుతుంది. అలాంటి పరిష్కారానికి తొలిమెట్టు–ప్రతి ఒక్కరం ఓటు హక్కును వినియోగించు కోవడం. అది దేశం పట్ల మనం నిర్వర్తించే ప్రాథమిక బాధ్యత. బాధ్యతాయుతమైన పౌరులుగా నడుచుకుందాం. శాంతి భద్రతల పరిరక్షణకు మన వంతు కృషి చేద్దాం!

సంపాదకుడు : ఎల్. సుబ్రమణ్యాన్

Visit us at : http://www.chandamama.com/telugu







***Founded by***
**B. Nagi Reddi and Chakrapani**

***Chairman :*** B. Viswanatha Reddi (Viswam)
***Editor & Publisher :*** L. Subramanyan
***Consultant Editor :*** K. Ramakrishnan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** Jayapandian
***Assistant Editor :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designer :*** B.A. Hemalata Malini

***CIRCULATION TEAM :***
***Chennai :*** **T N Ravi Shankar, *National Sales Manager***
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South***
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
***Mumbai :*** **Rajendra K Jadhav, *Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry Opp. State Bank of India, Near Police Station Cross Road No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi :*** **Sushil Sharma, *Circulation Manager-North***
Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
***Bangalore :*** **P. Murali, *Asst. Circulation Manager -Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
***Kolkata :*** **Ananth Prakash, *Circulation Manager-East***
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
***Ahmedabad :*** **Kalpesh Raval, *Sales Officer-Circulation***
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : sowmya.b@chandamama.com
***Head - Business Development :*** **Surajit Agarwal**
email : surajit@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Subscription Queries:*** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

**ANNUAL SUBSCRIPTION :**
Foreign : US$30 (including shipping and handling charges)

# పాఠకుల లేఖలు



ఇన్నాళ్ళపాటు ఎంతో సమర్థవంతంగా, ప్రతిష్ఠాత్మకంగా చందమామను నిర్వహించిన విశ్వం గారు కారణం ఏదైనా ఇక నుంచి బాధ్యతల నుంచి తప్పుకుంటున్నారని తెలియగానే నాకెంతో బాధని పించింది. ఇన్ని భాషలలో, ఇంత నేర్పుతో పిల్లల మనసులకు దగ్గరగా, పెద్దలకూ ఆహ్లాదకరంగా విజ్ఞాన వినోదాలను మేళవించి నిర్విరామంగా వెలువడుతూన్న పత్రిక బహుశా చందమామ ఒక్కటేనేమో!

రచయితలకు విలువనిచ్చి గౌరవించే పత్రిక కూడా చందమామే! ఎందుకంటే ఎన్నో పత్రికలకు కథలు, సీరియల్స్ పంపుతున్నాన్నేను. ఏ పత్రికా కూడా ప్రచురణ విషయం గురించి ముందస్తు సమాచారమివ్వడం, కాంప్లిమెంటరీ కాపీలు పంపడం, ఇంత చక్కని పారితోషి కాన్ని డబ్బు (ఎం.ఓ) రూపేణా పంపడం, కథ ప్రచురణ కాని నెలలలో కూడా రెగ్యులర్‌గా సంచిక పంపడం పద్ధతిగా చేయడం లేదు. 'చందమామ' మాత్రమే చేస్తున్నదని ఎంతో సంతోషంగా చెబుతున్నాను.

అందరికీ, చందమామకూ శుభం కలగాలనీ; మా మనవలకీ, మునిమనవలకీ కూడా చందమామ కథల విజ్ఞానం, వినోదం అందాలనీ అభిలషిస్తూ,

–నందిరాజు పద్మలతా జయరాం
వనస్థలిపురం, హైదరాబాద్ - **44**

మన చందమామ చుట్టుకొలత రవ్వంత తగ్గినట్టు అనిపిస్తున్నా కళ ఎక్కడికి పోతుంది? నాకింకా పాతికేళ్ళ కిందట కాలేజి నుంచి వస్తూ దారిలో ఆగి చందమామ కొంటూన్న అనుభూతి అలాగే తడితడిగా ఉంది. చందమామతో నాకున్న అనుబంధం మరపురానిది. హృదయ పూర్వక నూతన సంవత్సర శుభాకాంక్షలతో,

–కోలపల్లి ఈశ్వర్, నవాబుపేట,
నెల్లూరు–**524 002**



# న్యాయనిర్ణయం

నిరంజనవరంలోని రాఘవయ్య ఊళ్ళో వాళ్ళకు అవసరానికి అధిక వడ్డీలకు అప్పులిచ్చి బాగా కూడబెట్టాడు. అతడికి ఎప్పుడూ డబ్బు సంపాదన పైనే ధ్యాస. పిల్లికి బిచ్చం పెట్టని పరమపిసినారి. భార్యాపిల్లలు అది తగదని ఎంతచెప్పినా అతడికి డబ్బు సంపాదనపై యావ తగ్గలేదు.

ఒకనాటి రాత్రి రాఘవయ్య ఇంటికి ఇద్దరు వ్యక్తులు వచ్చి, ''ముఖ్యమైన పని మీద ఎగువన ఉన్న సీతానగరం వెళుతున్నాం. ఇక్కడికి వచ్చేసరికే బాగా పొద్దు పోయింది. రాత్రికి ఇంత తిండి పెట్టి పడుకోవడానికి స్థలమిచ్చారంటే నాలుగు వరహాలు ఇచ్చుకుంటాం,'' అన్నారు.

నాలుగు వరహాలు అన్న మాట వినగానే రాఘవయ్యకు ఆశకలిగింది. వాళ్ళను లోపలకు పిలిచి కూర్చోమన్నాడు. భోజనాలయ్యాక వాళ్ళను, ''అవునూ, సీతానగరం ఎందుకు వెళుతున్నారు? ఏమిటి పని?'' అని అడిగాడు ఉత్సాహంకొద్దీ.

ఆ ఇద్దరిలో కాస్త వయసు తక్కువగా ఉన్నవాడు, ''అయ్యా, అది చాలా రహస్యం. మీకు చెప్పేది కాదు లెండి,'' అన్నాడు.

రహస్యం అనగానే రాఘవయ్యకు మరింత కుతూహలం కలిగింది. అతడు రెండు మూడు సార్లు రెట్టించి అడిగిన మీదట ఆ రెండవవాడు చెప్పటానికి ఇష్టం లేనట్టు తప్పనిసరియై చెబుతున్నట్టుగా ముఖం పెట్టి, ''అయ్యా, ఇది చాలా రహస్యం. దీన్ని మీరు మరెక్కడా చెప్పనంటేనే చెబుతాను. ఈయన మా యజమాని. బతికి చెడ్డవాడు. అప్పుల వాళ్ళు ఇంటిమీద పడడంతో ఊళ్ళు పట్టుకు తిరుగుతున్నాడు. ఈయన పూర్వీకుల నుంచి వంశపారంపర్యంగా వచ్చిన

దాసరి వెంకట రమణ



సొంతం చేసుకోవాలనుకున్నాడు. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా, ''సీతానగరం దాకా ఏం వెళతారుగానీ, దాన్ని నేనే కొంటాను. ఏదో ఒక ధర చెప్పండి,'' అన్నాడు.

''అయ్యా, కడుపునిండా అన్నం పెట్టారు. ఈ రాత్రికి ఆశ్రయమిచ్చారు. మీరయితే పాతికవేల వరహాలివ్వండి. అంతకు తక్కు వయితే మాత్రం... వద్దు,'' అన్నాడు ఆ ఇద్దరిలో పెద్దవాడు.

రాఘవయ్య లౌక్యంతో వాళ్ళను మాటల్లో పెట్టి చివరికి పదివేల వరహాలకు బేరం కుదుర్చుకున్నాడు. తెల్లవారే సరికి వాళ్ళ మనసు మారిపోవచ్చునని, అప్పటికప్పుడే పదివేల వరహాలు వాళ్ళకిచ్చి, బంగారు ఇటుకను తీసుకుని లోపలి గదిలోని ఇనుప పెట్టెలో భద్రంగా దాచి, తృప్తిగా నిద్రకు ఉపక్రమించాడు.

ఉదయం నిద్రలేచిన రాఘవయ్యకు బాటసారులు వసారాలో కనిపించలేదు. తాము వచ్చిన పని పూర్తికావడంతో, తెల్లవారు జామునే తిరుగు ప్రయాణమై ఉంటారని అనుకుని, అతడు బంగారు ఇటుకను స్వర్ణకారుడి వద్దకు తీసుకువెళ్ళి పరీక్షించ మన్నాడు.

స్వర్ణకారుడు దానిని పరీక్షించి చూసి, ''పంచలోహం ముక్క మీద బంగారపు పూత పూశారు. ఇది, అసలు బంగారం కాదు,'' అని తేల్చిచెప్పాడు.

రాఘవయ్యకు గుండె ఆగినంత పన యింది. తలపై పిడుగు పడ్డట్టు అక్కడే కూల

బంగారు ఇటుకను, తప్పనిసరియై అమ్మ వలసి రావడంతో, దాన్ని కొనగల స్తోమత గల వ్యక్తి సీతానగరంలోని మణిగుప్తుడొకడే అని భావించి వెళుతున్నాం,'' అన్నాడు గొంతు తగ్గించి.

బంగారు ఇటుక పేరు వినగానే రాఘ వయ్య ఉలిక్కిపడ్డాడు. దానిని చూపించమని ప్రాథేయపడ్డాడు. అతి బలవంతం మీద బాటసారులు రహస్యంగా దాచిన బంగారు ఇటుకను తీసి అతడికి చూపుతూ, ''ఎంత లేదన్నా ఇది లక్ష వరహాలు చేస్తుంది. మేము చాలా అవసరంలో ఉన్నాం గనక, యాభై వేలయినా ఫరవాలేదనుకుంటున్నాం,'' అన్నారు.

దానిని చూడగానే రాఘవయ్యకు మతి పోయినంత పనయింది. ఎలాగైనా దాన్ని తన

బడ్డాడు. కొంతసేపటికి తేరుకుని, అప్పటి కప్పుడే బయలుదేరి రాజధానీనగరం చేరి రాజు యశోవర్ధనుణ్ణి దర్శించి, జరిగిన మోసం వివరించి న్యాయం చేయమని మొరపెట్టుకు న్నాడు.

యశోవర్ధనుడు యువకుడు. సునిశిత మైన ఆలోచనా పటిమతో త్వరగా న్యాయ నిర్ణయం చేయగలడని పేరున్నది. ఆయన రాఘవయ్య చెప్పినది శ్రద్ధగా విన్నాడు. ఆ తరవాత, ''ఇతణ్ణి కారాగారంలో వేయండి,'' అని భటులను ఆజ్ఞాపించాడు.

రాఘవయ్య బిత్తరపోయి లబోదిబోమం టూంటే, భటులు అతణ్ణి లాక్కుపోయి చెరసాలలో బంధించారు.

రాజు నిర్ణయానికి సభాసదులు కూడా నివ్వెరపోయారు. ''మోసపోయాను; నాకు న్యాయం చెయ్యండి, అంటూ మొరపెట్టు కున్న వాణ్ణి కారాగారంలో బంధించడం ఎక్కడి న్యాయం?'' అంటూ తమలో తాము గుస గుసలాడుకోసాగారు.

ఈ విషయం ఆనోటా, ఈనోటా పడి రాజ్య మంతటా వ్యాపించింది. ఎక్కడ నలుగురు చేరినా దీనిని గురించే వింతగా మాట్లాడుకో సాగారు.

ఇలా ఉండగా కొందరు ప్రముఖులు మంత్రిని కలుసుకుని, ''న్యాయం కోరి వచ్చిన వాణ్ణే బంధించడం అన్యాయం కదా?'' అని తమ నిరసనను తెలియజేశారు.

మంత్రి చెప్పగా ఆ సంగతి విన్న రాజు, చిరునవ్వు నవ్వి, ''వారం రోజుల్లో రాఘువ య్యను విచారించి తగిన న్యాయం చేస్తాను,'' అన్నాడు.



రాఘవయ్యను విచారించే రోజున సభ ప్రముఖులతో క్రిక్కిరిసిపోయింది. రాజు నిర్ణయం వినడానికి ప్రజలు పెద్ద ఎత్తున తరలివచ్చారు.

రాజు రాఘవయ్యను రప్పించి ఏం జరిగిందీ సభికులకు వివరించమన్నాడు.

రాఘవయ్య ఆ నాటి రాత్రి జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించి, ''ధర్మ ప్రభువులు! ఆ మోసగాళ్ళను శిక్షించి, నాకు తగిన న్యాయం చెయ్యాలి,'' అంటూ రాజుకు చేతులెత్తి మొక్కాడు.

ఆ తరవాత రాజు సభికులను ఉద్దేశించి, ''విన్నారు కదా! బాటసారులు రాఘవయ్యను మోసం చేశారు. అందులో సందేహం లేదు. అయితే, ఇక్కడ మరో ముఖ్య విషయం మరిచిపోకూడదు. బాటసారుల వద్దనున్న లక్ష వరహాల బంగారాన్ని పదివేల వరహాలకే సొంతం చేసుకోవాలని చూడడం రాఘవయ్య దురాశ. ఆ దురాశ అతడిలోని వివేకాన్ని మింగేసింది. అందువల్లే లక్ష వరహాల బంగారాన్ని పదివేలకే ఎందుకు వదులుకుంటారన్న విషయం అతడికి స్ఫురించలేదు. ఇలాంటి మోసాలు అక్కడక్కడ జరుగుతున్నాయని తెలియవచ్చింది. అయినా వాటి నుంచి ప్రజలు గుణపాఠం నేర్చుకోవడం లేదు. ఇలాంటి మోసం ఒకసారి జరిగితే, మోసం చేసిన వారిని కఠినంగా శిక్షించవచ్చు. కానీ మళ్ళీ మళ్ళీ జరిగాయంటే మోసపోయినవారిదే బాధ్యత. నిజానికి మన భటులు మరునాడే బాటసారులుగా నటించిన ఆ మోసగాళ్ళను పట్టుకుని వాళ్ళ దగ్గరున్న పదివేల వరహాలు స్వాధీనం చేసుకున్నారు. వాటిని ఇప్పుడే రాఘవయ్యకు అప్పగిస్తున్నాను. మునుముందు ఇలాంటి మోసాలు పునరావృతం కారాదు. ఈ విషయం మీకందరికీ తెలియాలనీ, అది మీ మధ్య చర్చనీయాంశం కావాలనీ, రాఘవయ్యను వారం రోజుల పాటు బంధించాను. అప్రమత్తులై మెలగండి,'' అన్నాడు.

యశోవర్ధనుడి యుక్తియుక్తమైన, ప్రబోధాత్మకమైన న్యాయనిర్ణయానికి సభికులు జేజేలు పలికారు.



# VALOUR & ADVENTURE HUMOUR & MYSTERY MORALS & HEROES

Enthralling stories of six decades come together in one incomparable collection




The Chandamama
60th Anniversary Collector's Edition
HARD COVER
Cover Price : Rs 449

**Special price for subscribers Nett. Rs. 360**




COLLECTOR'S EDITION

Take a trip down memory lane with the magazine's oldest editors, discover the beginnings of Chandamama and view some of the most memorable cover art across the decades.

Subscribers must fill in the order form below to avail of special discount.

**I want a copy of the Chandamama Collector's Edition.**

Name ................................................ Subscriber No ..........................

Address ................................................................................................

City ........................ State ........................ Pin ........................

Telephone ........................ Mobile ........................ Email ........................

Enclosed Cheque/DD for Rupees (in words) ........................................................

Cheque/DD no ........................ Favouring **Chandamama India Ltd**

on ........................................bank. *(Send At-Par cheques or add Rs 60 for non-Chennai cheques)*

Please mail the order form to :

**Chandamama India Limited,** No. 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelangarai, Chennai – 600 041. Phone: (044) 43992828 Email: chandamama@chandamama.com Web: www.chandamama.com. Allow 3 weeks for delivery.

# పెన్నిధి!

తాళాలు బాగుచేసి జీవించే వెంకప్ప కొడుకు రామప్ప తెలివైనవాడే గాని పరమసోమరి. తండ్రి ఎంత చెప్పినా పనినేర్చుకునే వాడుకాదు. అదే ఆయనకు తీరని విచారంగా ఉండేది. వెంకప్పకు వృద్ధాప్యం పైబడి మంచం పట్టాడు. ఆయన ఒకనాడు కొడుకును దగ్గరికి పిలిచి, ''నాయనా, మన భోషాణం పెట్టె తాళం పాత తాళాల్లో ఎక్కడో కలిసిపోయింది. నేను ఎంత వెతికినా దొరకలేదు. నీ తాతముత్తాతలు దాచిపెట్టిన ఎంతో విలువైన వస్తువొకటి పెట్టెలో ఉంది. ఎవ్వరికీ తెలియనీయక నువ్వు దాని తాళం చెవి కోసం ప్రయత్నించు. ఎలాగైనా మారుతాళంతోనైనా దాన్ని తెరిచి సుఖపడు. తాళాన్ని పగలగొట్టే పని మాత్రం చెయ్యొద్దు,'' అని చెప్పి కన్నుమూశాడు.

రామప్ప భోషాణం తాళం తెరవాలని పాత తాళం చెవులతో ప్రయత్నించాడు. వీలుపడ లేదు. మారు తాళాలు చేసి తాళం కప్ప తెరవాలని చూశాడు. సాధ్యపడలేదు. ఈ పనిలో రాత్రిం బవళ్ళు కొట్లోనే గడపసాగాడు. ఆ సమయంలో కొందరు వచ్చి తమ తాళాలు బాగు చేయించు కుని తృణమో పణమో ఇచ్చి వెళ్ళేవారు.

కొద్ది కాలానికి, రామప్ప ఒక మారుతాళం చేసి, పెట్టె తెరవగలిగాడు. పరమానందంతో పెట్టె తెరిచిన అతడికి, అందులో పాత ఇనుపసామాను, తండ్రి దస్తూరీతో ఓ తాళపత్రం తప్ప మరేదీ కనిపించలేదు!

ఆ తాళపత్రంలో, ''నాయనా, ఈ పెట్టె తెరవగలిగే తాళం చెవి చేసే నాటికి, నువ్వు మంచి పనివాడివి అయివుంటావని భావిస్తున్నాను. నీబద్ధకాన్ని పోగొట్టడానికి నాకు ఇంతకంటే మంచి మార్గం కనిపించలేదు. కష్టపడి జీవించడమే మనిషికి నిజమైన పెన్నిధి! అదే శాశ్వతమైనది,'' అని ఉండడం చదివి, తండ్రికి తనపై గల ప్రేమను తలుచుకున్న రామప్ప కళ్ళనుంచి ఆనంద బాష్పాలు రాలాయి.

–భీమవరపు పురుషోత్తం






# పాతాళదుర్గం

## 7

[సైనికులకు గుహలలో కాలశంబరుడూ, కుంభీరుడూ కనిపించలేదు. ఒక చీకటి గుహలో సైనికులిద్దరు కొండచిలువ వాతబడ్డారు. అక్కడే ధూమకుడికి కాలశంబరుడి మంత్రదండం దొరికింది. ఆ సమయంలో కదంబదేశమంత్రి ఒళ్ళంతా గాయాలతో గుర్రం మీద వచ్చి, తమ రాజైన ఉగ్రసేనుడి ముందు, ''సర్వనాశనం!'' అంటూ గుర్రం పైనుంచి కింద పడిపోయాడు. -తరవాత]

గంగాధరుడు వైద్యుణ్ణి పిలిచి కదంబమంత్రి గాయాలకు చికిత్స చేయమన్నాడు. ఇద్దరు సైనికులు మంత్రిని ఒక రాతికి ఆనించి కూర్చోబెట్టారు.

రాజు ఉగ్రసేనుడు అతడి ముందుకు వచ్చి, ''అమాత్యా! ఏమిటిదంతా?'' అని అడిగాడు.

గంగాధరుడు వైద్యుణ్ణి త్వరగా గాయాలకు కట్లు కట్టమని చెప్పి, ఆ పని పూర్తి కాగానే, ''అమాత్యా! ఇప్పుడు చెప్పండి. కదంబనగరాన్ని శత్రువు లేమైనా ఆక్రమించుకున్నారా?'' అని ప్రశ్నించాడు.

కదంబమంత్రి దాహం కావాలని సంజ్ఞ చేశాడు. సైనికుడొకడు ఆయనకు సొరబుర్ర లోంచి నీరు పోశాడు. మంత్రి దాహం తీర్చుకుని కొంత స్థిమితపడి, ''వీరు కుంతల దేశ మహామంత్రుల్లా వున్నారు,'' అంటూ గంగాధరుడికేసి తలాడించి, ''కదంబనగరం మీదికి

'చందమామ'



ఎవరో శత్రువులు దాడి కొచ్చారని వినగానే, నేను ఆ వచ్చిన వారు కుంతలదేశ సైనికులై వుంటారని భావించాను,'' అంటూ ఉగ్రసేనుడి కేసి భయంగా చూశాడు.

రాజు ఉగ్రసేనుడు కోపోద్రేకంతో వణికి పోతూ, ''కదంబనగరం శత్రువుల వశమై పోయింది. అదేనా నువ్వు చెప్పదలుచుకున్నది?'' అంటూ మంత్రిని గద్దించి అడిగాడు.

''మహారాజా, మీరు ఉద్రేకపడకండి,'' అంటూ గంగాధరుడు, ఉగ్రసేనుణ్ణి శాంత పరిచి, ''ఇంతకూ ఆ శత్రువు లెవరు?'' అని కదంబ మంత్రిని అడిగాడు.

''శత్రువులు పరదేశీయులైతే నగరం ఒక పట్టాన వాళ్ళ వశం అయివుండేది కాదు. విద్రోహం తలపెట్టింది కదంబ పౌరులే. వాళ్ళు ఉరుముల్లేని పిడుగుపాటు లాగా, మబ్బుల్లేని జడివానలాగా హఠాత్తుగా వచ్చి నగరం మీద పడ్డారు. నగర పౌరుల్లో చాలా మంది వాళ్ళతో ఏకమయ్యారు. ఇంకే ముంది, క్షణాల మీద రాజభవనం ఆక్రమించుకుని బొక్కసం కొల్లగొట్టారు,'' అన్నాడు కదంబమంత్రి.

''బొక్కసం కొల్లగొట్టారా? నా బొక్కసం! ఎన్నో తరాల నుంచి కష్టపడి కూడబెట్టిన డబ్బూ, బంగారం, వెండీ–అంతా,'' అంటూ ఉగ్రసేనుడు గాయపడ్డ బెబ్బులిలా భీకరంగా కేక పెట్టి, ''ఇంతకూ ఆ రాజద్రోహులకు నాయకులెవరు? వాళ్ళనిప్పుడే నా కత్తికి ఎర చేస్తాను. ఏదిరా, నా యుద్ధాశ్వం!'' అని కత్తి దూసి, దూరంగా మేస్తున్న తన గుర్రం కేసి పరిగెత్తబోయాడు.

గంగాధరుడు ఉగ్రసేనుడి రెక్క పట్టుకుని ఆపుతూ, ''మహారాజా! తమకు కుమార్తె ఎక్కువో, ఖజానా ఎక్కువో నా కర్థం కావటం లేదు. కొంచెం శాంతించండి, తొందరపడి లాభం లేదు,'' అని కదంబమంత్రి కేసి తిరిగి, ''ఆ విద్రోహులకు నాయకులెవరైనా వున్నారా, లేక అంతావట్టి అలగా జనమా?'' అని ప్రశ్నించాడు.

''మహామంత్రీ, వాళ్ళకు నాయకులు లేకపోవటం ఏమిటి? ధూమక సోమకులనే పితృ భ్రాతృ హంతకులున్నారే? ఆ పరమ కిరాతకులే ఆ దోపిడీ మూకకు నాయకులు. 'బొక్కసం దోచండి! అది మన నుంచి పన్నుల రూపంలో బలవంతంగా వసూలు చేసిన ధనమే!' అంటూ వాళ్ళు జనాన్ని ధనాగారం



మీదికి ఎగదోలారు,'' అన్నాడు కదంబ మంత్రి.

సోమకుడు పళ్ళు కొరికి, ముక్కుపుటా లెగరవేస్తూ కత్తి దూయబోయేంతలో ధూమ కుడు అతణ్ణి కనుసైగలతోనే వారించి, గంగాధరుడి ముందుకు వచ్చి, ''ప్రభూ, చూశారు గదా, ఈ అన్యాయం? గడిచిన రెండు రోజులుగా మేము కదంబ నగర ఛాయల్లోనే లేము. కదంబరాజ్య పాలకు లెంత నీచులో, కపటవర్తనులో, అసత్యవా దులో ఇప్పటికైనా మీ కర్థమైందా?'' అని ప్రశ్నించాడు.

గంగాధరుడు కదంబమంత్రి కేసి కొరకొర చూస్తూ, ''గత నలభై ఎనిమిది గంటల్లో కదంబ పాలకులు ఒక్కగానొక్క నిజమైనా పలికిన పాపాన పోలేదు. ఇంతలో ఎన్నెన్ని ఘోర పరాభవాలు? యువరాణిని రాక్షసు డెత్తుకుపోయాడు, కోశాగారం కొల్ల గొట్ట బడింది, రాజ్యం శత్రువుల హస్తగతమైంది, పాలకులిద్దరూ ప్రమాదకరమైన గాయాలతో కొట్టుమిట్టాడుతున్నారు. ఇంతకన్న చేసిన పాపాలకూ, ఆడిన అబద్ధాలకూ మరేం ప్రాయశ్చిత్తం జరగాలి?'' అన్నాడు.

రాజు ఉగ్రసేనుడు అవమానంతో కుంగి పోతూ, ''మహామంత్రీ, జరిగినదానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. రాజ్యం పోయిం దన్న దిగులు నాకేం లేదు. నా కుమార్తెను రాక్షసుడి నుంచి కాపాడే ప్రయత్నంలో మీ నుంచి సంపూర్ణ సహకారం అపేక్షిస్తున్నాను,'' అన్నాడు.

''సహకారానికేం, మహారాజా! శశికాం తుణ్ణి మాంత్రికుడెత్తుకు పోయాడని నా అనుమానం,'' అంటూ గంగాధరుడు ఆగి, ''ఆ ధ్వనులేమిటి? తప్పెట మోతలూ, కేకలూ, మీకు వినబడటం లేదా?'' అంటూ తన సైనికుల కేసి తిరిగి ప్రశ్నించాడు.

సైనికుల్లో ఇద్దరు ముగ్గురు అక్కడ ఎత్తుగా వున్న రాళ్ళ మీది కెక్కి, తప్పెట ధ్వనులూ, కొమ్ముబూరల మోతలూ విన వస్తున్న దిక్కు కేసి చూసి, ''ప్రభూ! జనం గుంపులు గుంపులుగా ఇటు కేసి వస్తు న్నారు. వాళ్ళల్లో కొందరు నాట్యాలు చేస్తూ తప్పెటలు వాయిస్తున్నారు,'' అని చెప్పారు.

అంతలో ఒక అశ్వికుడు చెట్ల మధ్య నుంచి బాణంలా దూసుకు వచ్చి ఉగ్రసేను డికి అల్లంత దూరంలో గుర్రం దిగాడు.




అతడు ధరించిన దుస్తులు అక్కడక్కడా కాలి వున్నవి. మొలలో ఖడ్గం లేని ఖాళీ ఒర వేలాడుతున్నది. అతడు ఉగ్రసేనుడి కోశాధి కారి!

''కోశం కొల్లగొట్టేశారు, మహారాజా! నేను తమరిని హెచ్చరించడానికి ప్రాణాలతో పారి పోయి వచ్చాను. జనం మీ కోసం ఇటు కేసి వస్తున్నారు. పారిపోకపోతే ప్రాణాలు దక్కవు,'' అంటూ కోశాధికారి, రాజు కాళ్ళ మీద పడి పోయాడు.

''ఎక్కడికి పారిపోవటం? ఎలా పారి పోవటం?'' అన్నాడు గంగాధరుడు, ధూమక సోమకుల్ని దగ్గిరకు రావలసిందిగా సంజ్ఞ చేస్తూ.

''సైన్యాలను సమకూర్చుకుని, ఆ రాజ ద్రోహుల్ని హతమార్చండి, మహారాజా!'' అంటూ కదంబమంత్రి తమ రాజుకు సలహా పలికాడు.

''సైన్యాలు!'' అంటూ గంగాధరుడు హేళ నగా నవ్వి, ''పౌరులందరూ ఎదురు తిరి గారు, ఇక సైన్యాలను గాల్లోంచి సమకూరు స్తావా, మంత్రీ!'' అని కదంబ మంత్రిని కోప్పడి, ''ఇప్పుడు మిమ్మల్ని రక్షించవలసిన వాళ్ళు ధూమక సోమకులు. ఏం, ధూమక సోమకుల్లారా! ఆ కార్యం మీరు నిర్వహించ గలరా?'' అని అడిగాడు.

''ఈ రాజూ, మంత్రీ ప్రాణాలు కాపాడ గలమేమో గాని, వాళ్ళ రాజ్యం మాత్రం తిరిగి వాళ్ళకు ఇప్పించలేం,'' అన్నాడు ధూమకుడు తల అడ్డంగా ఊపుతూ.

''రాజు లేని రాజ్యం అంటూ ఎక్కడా వుండదు. నీ కేమైనా మతి పోయిందా, ధూమకా?'' అన్నాడు గంగాధరుడు కసురు తూన్నట్టు.

''మహామంత్రీ! నాకు రాజ్యం అవసరం లేదు. ఇప్పుడే నా కుమార్తెను వెతుక్కుంటూ అరణ్యాలు పట్టి పోతాను,'' అన్నాడు ఉగ్ర సేనుడు.

''రాజుతోనే గదా మంత్రి బతుకు!'' అన్నాడు కదంబమంత్రి.

''రాజ్యమే లేనప్పుడు, ఇంక కోశాగారం ఎక్కడిది! నేనూ మీతోపాటే వస్తాను,'' అన్నాడు కోశాధికారి.

''మీలో ఒక్కరిని కూడా ఆ వచ్చే జనం ప్రాణాలతో ఇక్కణ్ణించి పోనివ్వరు,'' అంటూ సోమకుడు రంకె వేశాడు.

“ఇక్కడ ఆజ్ఞాపించేవాణ్ణి నేను. అనవసర ప్రసంగాలెవరూ చేయకూడదు,” అంటూ గంగాధరుడు కళ్ళెర్రచేసి, “ఉగ్రసేన మహారాజూ, అతడి పరివారమూ కుంతలదేశ రాజుకు శరణాగతులు. వాళ్ళ ప్రాణాలు కాపాడవలసిన బాధ్యత నాది. ధూమకా! సోమకా! మీరిద్దరూ ఇప్పుడే బయలుదేరి పోయి, ప్రజల్ని కదంబనగరం కేసి తిరుగు ముఖం పట్టించాలి. వాళ్ళు మొండిగా ముందు కొచ్చారో రక్తపాతం జరుగుతుంది,” అని చెప్పి, తన సైనికులను యుద్ధసన్నద్ధులు కావలసిందిగా ఆజ్ఞాపించాడు.

ధూమకసోమకులకు, కుంతలదేశమంత్రి ఆజ్ఞ ఆశ్చర్యాన్నీ, కోపాన్నీ కూడా తెప్పించింది. సోమకుడు శపథం చేయబోయే వాడిలా చేయెత్తి ఏమో అనబోయేంతలో, ధూమకుడ తణ్ణి భుజం పట్టుకుని దూరంగా లాక్కుపోయి, “సోమూ, తొందరపాటు పనికిరాదు. గంగాధర మంత్రితో ఈ సమయంలో పోట్లాట పెట్టుకుంటే, సుశిక్షితులైన అతడి సైనికులు, మన కదంబప్రజల్ని తేలిగ్గా ఓడించి, తిరిగి ఆ దుర్మార్గుడైన ఉగ్రసేనుణ్ణి సింహాసనం ఎక్కించగలరు. కనుక, మనం ప్రస్తుతానికి రాజీగా పోవటమే మంచిది,” అన్నాడు.

సోమకుడు అయిష్టంగా తలపూపుతూనే, ధూమకుడితోపాటు బయలుదేరాడు. ఇద్దరూ గుర్రాలెక్కి, విజయనినాదాలు చేస్తూ అటు కేసి వస్తున్న కదంబ పౌరులకు ఎదురు వెళ్ళారు. పౌరుల్లో కొందరు వాళ్ళిద్దర్నీ గుర్తించి, “అరుగో, ధూమక సోమకులు!



వాళ్ళ నాయకత్వం కింద మనం, కుంతల దేశ రాజు శతభానుణ్ణి కూడా సింహాసనం విడిచి అడవులు పట్టి పోయేలా చేయగలం,” అంటూ కేకలు పెట్టారు.

ధూమకుడు ప్రజల గుంపును సమీపించి, తప్పెటల వాళ్ళనీ, కొమ్ముబూరల వాళ్ళనీ నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించి, “పౌరులారా! ఇక మీరు శాంతంగా కదంబ నగరానికి తిరిగిపోవటం మంచిది. ఉగ్రసేనుడూ, అతడి మంత్రీ కూడా కుంతలదేశ అమాత్యుడైన గంగాధరుడి శరణుజొచ్చారు. ఇప్పుడు వాళ్ళిద్దర్నీ మీరు చంపదలిస్తే, కుంతల సైనికులతో యుద్ధం తప్పదు. అందులో మనకు విజయం కలుగుతుందన్న నమ్మకం నాకు లేదు. ఒకవేళ మనం తాత్కాలికంగా విజయవంతులమైనా, కుంతల

రాజు సర్వసైన్యాన్ని వెంటబెట్టుకుని మన మీద దాడి చేస్తాడు. ఆ సంగతి గుర్తుంచుకోండి,'' అన్నాడు.

''అతణ్ణి ఎదిరించి పోరాడుతాం! రాజరికం అన్నది లేకుండా చేసేందుకు ఆత్మార్పణ చేయటానికి మేం సిద్ధం!'' అంటూ జనంలోంచి కొందరు యువకులు పెద్దగా కేకపెట్టారు.

''ఆవేశంలో ఆత్మార్పణకీ, ఆత్మహత్యకీ తేడా మీకు తెలిసినట్టు లేదు,'' అంటూ ధూమకుడు పెద్దగా నవ్వి, ''ఆ అరిచే వీరులంతా ఇళ్ళకు పోయి హాయిగా కోతి కొమ్మచ్చు లాడుకోండి. నేను కదంబ పౌర ముఖ్యుల్ని ముందుకు రావలసిందిగా కోరుతున్నాను,'' అన్నాడు.

జనం దారి ఇవ్వగా నలుగు రైదుగురు వృద్ధులు ముందు కొచ్చారు. ధూమకుడు గుర్రం దిగి వాళ్ళకు నమస్కరించి, ''అయ్యలారా! మీరు ఇక్కడ నాయకత్వం వహించి, ఉడుకురక్తం కుర్రకారును అదుపులోపెట్ట కోరుతున్నాను. గంగాధరమంత్రి అన్నట్టు, రాజు లేని రాజ్యం వుండదు. ఇక కందబ దేశానికి ఉగ్రసేనుడు రాజుగా రావటం జరగదు. కాని, ఆయన కుమార్తె కాంతిసేన మాటేమిటి?'' అన్నాడు.

''కాంతిసేనమాకు రాణీకావాలి!'' అంటూ జనంలో నుంచి కేకలు బయలుదేరినై. పౌర వృద్ధులు కూడా దానికి అంగీకార సూచకంగా తలలు వూపారు.

''అలా అయితే, అందరూ ప్రశాంతంగా కదంబ నగరానికి వెళ్ళిపొండి. రాక్షసుడు అపహరించుకు పోయిన, ఆ యువరాణిని తిరిగి తెచ్చే బాధ్యత నాది,'' అన్నాడు ధూమకుడు.

జనం ధూమకుడి కొకసారి జై కొట్టి నగరం కేసి బయలుదేరారు. ధూమక సోమకులు గుర్రాలను మళ్ళించి, గంగాధరుడున్న చోటుకు బయలుదేరేంతలో, ధూమకుడి నడుము నుంచి వేలాడుతున్న కాలశంబరుడి మంత్రదండం, జుంయ్ మంటూ శబ్దం చేసి, కట్టివున్న తాడును తెంచుకుని గాలిలోకి లేచింది. సోమకుడు గుర్రం మీద లేచి నిలబడి, మంత్రదండాన్ని పట్టుకునేందుకు పైకెగిరాడు. -(ఇంకావుంది)





# రాజనీతి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, ఎవరి మెప్పును పొంద కోరి నువ్విలా భీకర వాతావరణంలో శ్రమ పడుతున్నావో నాకు తెలియదు. అయితే, చంచల చిత్తులూ, అధికార మదోన్మత్తులూ అయిన రాజులు ఎప్పుడు ఎవరిని మెచ్చుకుంటారో చెప్పడం కష్టం. నీతిశాస్త్ర కోవిదుడూ, రాజనీతి వేత్తా అని పేరుగాంచిన సుధర్ముడనే రాజు, ప్రాణాలకు తెగించి పోరాడిన సేనాధిపతిని ఉదాసీన పరచి అనామకుడైన ఒక వంటవాణ్ణి తెగమెచ్చుకున్న వింత ఉదంతం చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,’’ అంటూ ఇలా చెప్పసాగాడు:

బేతాళ కథలు



భద్రగిరి రాజు నరేంద్రభూపతి ప్రజా క్షేమాన్ని ప్రాణప్రదంగా భావించే ధర్మ ప్రభువు. ఆయన పరిపాలనలో ప్రజలకు ఎలాంటి కొరతా లేదు. అయితే, రాజుకు ఎన్నాళ్ళకూ సంతాన భాగ్యం కలగక పోవ డంతో ఆయన మనసును తరచూ విచార మేఘాలు కమ్ముకోసాగాయి.

ఇలా ఉండగా ఒకనాడు బదరికావనం నుంచి తీర్థయాత్ర చేస్తూ భద్రగిరికి వచ్చిన ఒక సాధుపుంగవుడు రాజుగారి ఆతిథ్యాన్ని పొంది, బయలుదేరుతూ ఒకఅద్భుతఫలాన్ని ప్రసాదించాడు. దాని మహత్యంతో సంవ త్సరం తిరిగే సరికి రాజదంపతులకు కవల పిల్లలు కలిగారు. పరమానందం చెందిన రాజు వారికి సుధర్ముడు, సుసేనుడు అని పేర్లు పెట్టి అల్లారు ముద్దుగా పెంచుతూ, విద్యాబుద్ధులు నేర్పసాగాడు.

రాజకుమారులు ఇద్దరూ ఒకరితో ఒకరు పోటీ పడి విద్యాభ్యాసం చేయసాగారు. సుధర్ముడు రాజనీతి, ధర్మశాస్త్రాల పట్ల ఆసక్తి కనబరచేవాడు. సుసేనుడు విలువిద్య, ఖడ్గయుద్ధం మొదలైన క్షాత్రవిద్యల పట్ల అమిత ఆసక్తి కనబరచేవాడు.

యేటా విజయదశమి సందర్భంగా జరిగే క్షాత్రవిద్యల ప్రదర్శనలప్పుడు సుసేనుడు అందరికన్నా ముందుండేవాడు. అన్నదమ్ముల ద్వంద్వయుద్ధ ప్రదర్శనలో సుధర్ముడు తమ్ముణ్ణి ఓడించడం భావ్యంకాదనీ, అతడికి ఏమాత్రం గాయం తగల కూడదనీ జాగ్రత్త పడేవాడు. అయితే, సుసేనుడు అసమాన ప్రతిభను కనబరుస్తూ, అన్నను మించిన వాడని నిరూపించడానికి తహతహలాడేవాడు. అందుకు హద్దులు దాటడానికీ, అడ్డదారులు తొక్కడానికీ కూడా వెనుకాడేవాడు కాదు.

సుసేనుడి ధోరణి మహారాజుకు అసం తృప్తినీ, ఆందోళననూ కలిగించేది. అది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏదో కీడుశంకిస్తూ, రాజగురువు వద్ద తన ఆవేదనను వెలిబుచ్చేవాడు. అయినా రాజగురువు, ''యువరక్తం కదా, అలాగే ఉంటుంది. పెరిగేకొద్దీ పరిపక్వత వచ్చి సర్వం సర్దుకుంటుంది, విచారించకండి మహారాజా,'' అని ఓదార్చేవాడు.

యుక్తవయస్కులయ్యాక సుధర్ముడికి వజ్రగిరి రాజకుమార్తెతోనూ, సుసేనుడికి రత్నగిరి రాజకుమారితోనూ ఘనంగా వివాహాలు జరిగాయి. ఆ తరవాత కొన్నాళ్ళకు సుధర్ము డికి రాజ్య సింహాసనం అప్పగించి, తాను వానప్రస్థానికి వెళ్ళాలని నిర్ణయించి, మహా

రాజు అందుకు కావలసిన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నుడయ్యాడు.

ఆ సమయంలో భార్యాసమేతంగా రత్నగిరిలో కొన్ని రోజులు గడిపివచ్చిన సుసేనుడు ఒకనాడు రాజగురువును ఏకాంతంలో కలుసుకుని, ''గురువర్యులకు ఒక విన్నపం. క్షాత్ర విద్యలలో సుధర్ముడికన్నా నేను మేటినన్న విషయం మీకు తెలియనిదికాదు. అలాంటప్పుడు రాజ్యసింహాసనం నాకు చెందడమే న్యాయం కదా?'' అన్నాడు.

ఆ మాటకు ఉలిక్కిపడ్డ రాజగురువు, ''అదెలాసాధ్యం సుసేనా? రాజ్యసింహాసనం జ్యేష్ఠకుమారుడికి చెందడమే సంప్రదాయం. రాజనీతి కోవిదుడైన జ్యేష్ఠ కుమారుడు సుధర్ముడు. అతడే సింహాసనానికి తగిన వారసుడు,'' అన్నాడు.

'మేము కవలలమే కదా? కొన్ని క్షణాలు ముందుగా పుట్టినంత మాత్రాన జ్యేష్ఠుడై పోతాడా? రాజనీతి కోవిదుడూ, ధర్మశాస్త్ర పారంగతుడూ అమాత్యుడిగానో, ప్రధాన సలహాదారుగానో ఉండతగిన వాడన్న సంగతి మీకు తెలియనిదా? మీ మాట అంటే మహారాజుకు మహాగౌరవం. అందుకే నా మనసులోని మాటను మీ ద్వారా ఆయనకు విన్నవించదలిచాను,'' అన్నాడు సుసేనుడు.

''స్వార్థం కోసం సత్సంప్రదాయాల హద్దులు దాటి ప్రవర్తించడం ఏమాత్రం అభిలషనీయం కాదు. నిమిషాలేకాదు; క్షణాల తేడా అయినప్పటికీ జ్యేష్ఠుడు, జ్యేష్ఠుడే కదా? అధికారం కోసం దాన్ని అంగీకరించకపోవడం అనర్థదాయకమే అవుతుంది. పగలన్నిటిలోకీ



అన్నదమ్ముల పగ మహా భయంకరమైనది. నీ రాజ్యకాంక్షను చిగురులోనే చిదిమి వేయడమే శ్రేయస్కరం. మహారాజు ఆశిస్తున్నట్టు నువ్వు సర్వసేనాధ్యక్షుడివై అగ్రజుడికి కుడి భుజంగా నిలిచి రాజ్య రక్షణా బాధ్యతలు స్వీకరించు. అదే మన రాజ్య ప్రజలకు శుభకరం; నీకూ, నీ వంశ ప్రతిష్ఠకూ కీర్తిదాయకం,'' అని హితవు పలికాడు రాజగురువు.

''రాజును చేయకపోతే, నా అర్ధ రాజ్యం నా కప్పగించండి. అందుకు తగ్గ అర్హత, హక్కు నాకున్నవి. అన్నిటికీ మించి రాజ్యం వీరభోజ్యం అన్న వాస్తవం మరిచిపోకండి,'' అని చెప్పి సుసేనుడు అక్కడి నుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

రాజగురువు మహారాజును కలుసుకుని సంగతి వివరించాడు. అంతా విన్న మహారాజు, ''నేను ఏది జరగకూడదని భయ



పడ్డానో అదే జరుగుతున్నది. అత్యాశాపరుడైన సుసేనుడికి ఇప్పుడు మామగారైన రత్నగిరిరాజు దుర్జయుడు తోడయ్యాడు. పాతికేళ్ళ క్రితం అతడు మన రాజ్యాన్ని కబళించడానికి చేసిన విఫలయత్నం మీకు తెలియనిదికాదు. అయినా, సుసేనుడి కోరిక ఏమాత్రం ఆమోదయోగ్యం కాదు. ఏది ఏమైనా అనుకున్న ముహూర్తంలో సుధర్ముడికి రాజ్యపట్టాభిషేకం జరిపిద్దాం,'' అన్నాడు గాఢంగా నిట్టూరుస్తూ.

సుసేనుడు సైన్యాధ్యక్ష పదవిని చేపట్టడానికి నిరాకరించడంతో అతడి బాల్యమిత్రుడూ, మాజీ సైన్యాధ్యక్షుడి కుమారుడూ అయిన సుధీరుడు భద్రగిరి సేనాధిపతి అయ్యాడు. పెద్దలు నిర్ణయించిన ఒక శుభముహూర్తంలో సుధర్ముడు తల్లిదండ్రులు, గురువుల ఆశీస్సులతో భద్రగిరి సింహాసనాన్ని అధిష్ఠించాడు.

రాజధానిలో కొన్నాళ్ళు నిర్లిప్తంగా గడిపిన సుసేనుడు, భార్యను వెంటబెట్టుకుని రత్నగిరికి వెళ్ళాడు. ఇలాంటి సందర్భం కోసమే ఎదురు చూస్తూన్న రత్నగిరి రాజు దుర్జయుడు లోలోపల పరమానందం చెందాడు. అయినా, పైకి బాధ నటిస్తూ, "విచారించకు సుసేనా! ఈ క్షణమే నిన్ను రత్నగిరికి యువరాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేస్తున్నాను. మును ముందు రత్నగిరికే కాదు; భద్రగిరితో కలిపి సువిశాల సామ్రాజ్యానికి నిన్ను మహారాజును చేయడమే నా ఏకైక లక్ష్యం,'' అని ఓదార్చాడు.

భద్రగిరి సైన్యం రత్నగిరి సైన్యం కన్నా నాలుగింతలు పెద్దది. ప్రత్యక్షంగా దాడిచేసి జయించడం అసాధ్యం. అందువల్ల ఇతర మార్గాలలోనే విజయం సాధించాలని దుర్జయుడు తీవ్రంగా ఆలోచించసాగాడు. భద్రగిరి రాజ్య రక్షణా పద్ధతులు, రహస్యాలు ఎరిగిన సుసేనుడు తన గుప్పెట్లో ఉన్నాడు గనక, అసాధ్యాన్ని సుసాధ్యం చేసుకోవడానికి త్వరత్వరగా పథకాలు రూపొందించసాగాడు.

సుసేనుడు రత్నగిరికి చేరడం మహారాజుకు మానసిక క్షోభను కలిగించింది. నిప్పుకు గాలి తోడయినట్టు చేతులు కలిపిన మామా అల్లుళ్ళ వల్ల ఎప్పుడు ఎలాంటి ముప్పు వస్తుందోనని విచారపడసాగాడు. అయితే, అలాంటి అవాంఛనీయ సంఘటనలు ఏవీ లేకుండా సంవత్సర కాలం గడిచిపోయింది. వానప్రస్థానికి వెళ్ళేముందు ఒకసారి కాశీయాత్ర చేసి రావాలన్న కోరికతో మహారాజు సతీసమేతంగా బయలుదేరి వెళ్ళాడు.



ఒకనాటి సాయంకాలం రాజు సుధర్ముడు రానున్న విజయదశమి వేడుకల సందర్భంగా తీసుకోవలసిన భద్రతాచర్యల గురించి సేనాధిపతి సుధీరుడితో చర్చించి పంపేసి, తన రాక కోసం రాజోద్యానంలో ఎదురు చూస్తున్న రాణికేసి నడవసాగాడు.

ఉన్నట్టుండి రాజభవనంలో హాహాకారాలు చెలరేగాయి. సుధీరుడు వెనుదిరిగి చూసి ఏం జరుగుతున్నదీ తెలుసుకునే సరికే, అతడి మీదికి కత్తి దూసి ఉరుకుతున్న భటుడొకణ్ణి అడ్డుకోవడానికి పరిగెత్తుకు వచ్చిన సుధీరుడి కుడి భుజం తెగి అలాగే కుప్పకూలి పోయాడు. అతణ్ణి గాయ పరచిన వాడు వెనుదిరిగి పారిపోయాడు. హఠాత్తుగా జరిగిన ముట్టడిలో పలువురి కాపలా భటుల తలలు తెగిపడ్డాయి. మరి కొందరు కాళ్ళు చేతులు పోగొట్టుకున్నారు.

నిశ్చేష్టుడైన రాజు దృష్టి అంతఃపుర స్త్రీల ఆర్తనాదాల మీదికి మళ్ళింది. వంటవాళ్ళు, నౌకర్లు కొందరు స్త్రీల చుట్టూ రక్షణావలయంగా నిలబడ్డారు. ప్రధాన వంటవాడు వల్లవుడు వంటగదిలోని పెద్ద కత్తిని అందుకుని వచ్చిన వారిని వచ్చినట్టు తెగటార్చసాగాడు. మరికొంత సేపటికి సైనిక భటులు రావడంతో సద్దుమణిగి రాజభవనంలో శ్మశాన నిశ్శబ్దం అలముకున్నది.

మహారాజు లేని సమయం చూసి సుధర్ముణ్ణి హతమార్చి భద్రగిరిని వశపరచుకోవాలని కొందరు భటులతో మారువేషంలో భద్రగిరిలో ప్రవేశించిన రత్నగిరి రాజు దుర్జయుడు, సుసేనుల దుష్టపథకం విఫలమయింది. తిరుగు ప్రయాణంలో ఒక నదిని దాటుతూ పడవ గల్లంతు కావడంతో సుసేనుడు ఉధృతమైన ప్రవాహంలో మునిగి కొట్టుకుపోయాడు.

తీర్థయాత్రకు వెళ్ళి తిరిగివచ్చిన మహారాజు సమక్షంలో ఆ యేటి విజయదశమి వేడుకలు ఎప్పటిలాగే జరిగాయి. పోటీలలో గెలుపొందిన వీర యువకులకు బహుమతులు అందించిన రాజు సుధర్ముడు, ''పోటీలలో పాల్గొని తమ ప్రతిభను ప్రదర్శించిన యువకులందరికీ అభినందనలు. ఈ యేడు పోటీల్లో పాల్గొనడానికి వచ్చిన యువకుల్లా రాజధానిలో జొరబడి రాజభవనాన్ని ముట్టడించిన శత్రువుల ఆటకట్టించిన వీరులను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ముఖ్యంగా అంతఃపుర స్త్రీలను కాపాడడంలో అత్యంత ప్రతిభనూ, అద్భుతమైన సమయస్ఫూర్తినీ

ప్రదర్శించిన వల్లవుణ్ణి హృదయపూర్వకంగా అభినందిస్తూ అతణ్ణి దళనాయకుడిగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

సుధర్ముడి మాటలకు మహారాజు, రాజ గురువు సంతోషించారు. అయితే, అక్కడే కూర్చున్న సుధీరుడి ముఖం వివర్ణమయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రాజు సుధర్ముడు తన మీద జరిగిన హత్యాప్రయ త్నాన్ని అడ్డుకోవడానికి, ప్రాణాలను సైతం లెక్కచేయకుండా ముందుకు దూకి క్షత గాత్రుడైన సేనాధిపతి సుధీరుణ్ణి ఉదాసీన పరచి, ఒక వంటవాడి ధైర్యాన్ని మెచ్చుకోవడం సబబేనా? అంతఃపుర స్త్రీలతో పాటు రాణి క్షేమానికి దోహద పడడం వల్లే వంటవాడి ధైర్యాన్ని రాజు ప్రత్యేకంగా అభినందించి వాణ్ణి దళనాయకుడి పదవితో సత్కరించాడా? రాజనీతి కోవిదుడుగా పేరుగాంచిన సుధ ర్ముడు ఎందుకిలా చేశాడు? వృద్ధ రాజు, రాజగురువు సంతోషించడానికి గల కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అత్యవసర స్థితిలో స్పందించే తీరును బట్టే వీరుల అసలు శక్తిసామర్థ్యాలు నిర్ణయించాలి. ఆక స్మికదాడిలో రాజును కాపాడడానికి సుధీరుడు ప్రాణాలను లెక్కచేయకుండా ముందడుగు వేయడానికి అతడి చిత్తశుద్ధి, త్యాగ బుద్ధి కారణం. అందులో సందేహం లేదు. అది అతడి ఉద్యోగ ధర్మం కూడా అన్నది మరిచి పోకూడదు. అయితే, ఆకస్మిక ప్రమాదాలు ఎదురైనప్పుడు తను చావడం కన్నా, శత్రువు లను చంపడమే విజయానికి దోహదం చేస్తుంది. అలా సమయ స్ఫూర్తితో, ధైర్యంగా శత్రువు లను తెగటార్చిన వాడు వల్లవుడు. ఇంతకూ అతడు సైనికశిక్షణ లేని సాధారణ పౌరుడు. అందుకే అతణ్ణి సుధర్ముడు అంతగా అభి నందించాడు. మహారాజు, రాజగురువు అతడి నిర్ణయానికి సంతోషించడానికి గల కారణం కూడా అదే!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : 'మంజుభారతి' రచన]



## పెంపుడు జంతువు కోసం ఒబామా వాగ్దానం



బరాక్ ఒబామా ఎన్నికల ప్రచారంలో అమెరికా ప్రజలకు ఎన్నో వాగ్దానాలు చేశాడు. వాటన్నిటిలోకీ ఆయన తన కుమార్తెలు మలీయా (10) శషా (8)లకు చేసిన వాగ్దానం చాలా ప్రత్యేకమైనదనే చెప్పాలి. శ్వేతసౌధానికి చేరేప్పుడు వాళ్ళు ఆప్యాయంగా పెంచుకుంటూన్న కుక్కపిల్లను కూడా తీసుకువెళతామన్నదే ఆ వాగ్దానం. ''మీ ఇద్దరినీ నేను మీరు ఊహించలేనంతగా ప్రేమిస్తున్నాను. మీరు ఎంతో ఆప్యాయంగా పెంచుకుంటూన్న కుక్కపిల్లను కూడా మనతో తీసుకువెళదాం,'' అన్నాడు ఒబామా తన పిల్లలతో.

యునైటెడ్ స్టేట్స్ హ్యూమేన్ సొసైటీ ప్రెసిడెంట్ వేనే పేసిల్ అంతకు ముందు తాము ఒక కుక్కను పోషించగలమని చెప్పిన విషయం ఒబమా కుటుంబానికి గుర్తు చేశాడు. ''ఒక దిక్కు లేని జంతువును చేరదీసి పెంచడానికి సాయపడడం ద్వారా బరాక్ ఒబమా అమెరికన్లకు గొప్ప ఉదాహరణ కావచ్చు,'' అన్నాడాయన.

## వీధులకు మహాత్మాగాంధి పేర్లు

**1948** జనవరి 30వ తేదీ గాంధీ ప్రాణత్యాగం చేశారు. ''గాంధీజీ అహింసా సిద్ధాంతం, ప్రపంచశాంతి పట్ల ఆయనకు గల నిబద్ధత, దీన జనోద్ధరణకు ఆయన చేసిన కృషి,'' మొదలైనవాటిని ప్రపంచ ప్రజలు శాశ్వతంగా గుర్తుంచుకునేలా చేయడానికి అమెరికా నెవాడాలోని గాంధీ మాన్యుమెంట్ కౌన్సిల్ ఆశిస్తోంది. అందులో ఒక అంశంగా రాజన్ జేడ్, రెవ్. జీనీ శావాయ్ జూనియర్‌తో కలిసి అమెరికాలోనూ ప్రపంచ వ్యాప్తంగానూ 185 నగరాలలోని వీధులకు 'మహాత్మాగాంధీ మార్గ్' అని పేర్లు పెట్టాలని సంకల్పించింది. రాజన్ జేడ్, ''గాంధీ జీవితం, ఆలోచనలు ప్రపంచం మీద ప్రగాఢ ప్రభావాన్ని చూపాయి. 20వ శతాబ్దపు గొప్ప నైతిక, రాజకీయ, శాంతి నాయకులలో ప్రముఖుడిగా ఆయన మన్ననలు అందుకుంటున్నారు,'' అని చెప్పాడు. పేర్లు పెట్టడానికి సంప్రదించిన నగరాలలో జనసాంద్రత అధికంగాగల సియోల్, టోక్యో, న్యూయార్క్, లండన్ మొదలైన నగరాలూ తక్కువగా ఉన్న ఎశ్చెన్, వల్లెటా (మాల్టా) ఎన్‌కాంప్ (అండోరా) డుడెలాంజ్ (లక్సెంబర్గ్) వంటి నగరాలూ ఉన్నాయి.




గాంధీ మాన్యుమెంట్ కౌన్సిల్‌లో ఇతరులతో పాటు క్రైస్తవ, ముస్లిం, హిందూ, బౌద్ధ, యూదు, బహాయీ, స్థానిక అమెరికన్ క్లెర్జీ మతాలకు సంబంధించిన వారు కూడా ఉన్నారు.



# జీమూతవాహనుడు

ప్రేమ మానవ జీవనాధారం. మానవ జీవితానికి అర్థం, పరమార్థం సమకూర్చేది ప్రేమ. అందుకే ప్రేమను దివ్యస్వరూపంగానూ, దేవుణ్ణి కరుణాస్వరూపుడిగానూ విజ్ఞులు అభివర్ణి స్తారు. భార్యాబిడ్డలను, బంధుమిత్రులను ప్రేమించడం ప్రకృతి సహజం. అయితే, అపరిచితులనూ, హాని తలపెట్టినవారినీ ప్రేమతో చూడడం అన్నది అందరికీ సాధ్యం కాదు. అందుకే అలా చేసే వారిని కారణ జన్ములుగా పేర్కొంటారు. ప్రేమే దైవంగా, జీవితమే తపస్సుగా అరుదైన జీవితం సాగించిన విద్యాధర వీరకుమారుడు జీమూతవాహనుడు!

హిమాలయ ప్రాంతంలోని కాంచనపుర నగరాధిపతి జీమూతకేతుడి ఏకైక కుమారుడు జీమూతవాహనుడు. రాజభవన ప్రాంగణంలో అద్భుతశక్తులు గల కల్పవృక్షం ఉండేది. వంశానుగతంగా వస్తూన్న దాని కారణంగా రాజకుటుంబంతో పాటు నగర ప్రజలందరూ సకల సౌభాగ్యాలతో తులతూగే వారు. ఆ వృక్షాన్ని చూస్తూంటే యువకుడైన జీమూతవాహనుడిలో రకరకాల ఆలోచనలు కలిగేవి. అతడు ఒకనాడు తండ్రిని, ''భూప్రపంచంలో అసంఖ్యాకులు ఆకలి దప్పులతో అలమటిస్తూండగా మనం మాత్రం కల్పవృక్షం మహిమతో సుఖభోగాలు అనుభవించడం భావ్యమేనా?'' అని అడిగాడు.

అందుకు జీమూతకేతుడు, ''నాయనా, నాకు ఈ దివ్యవృక్షం నా తాత ముత్తాతల నుంచి సంక్రమించింది. దానిని నీకు అప్పగించాలని ఉన్నాను. దానిని ప్రపంచానికి సమర్పించాలన్నదే నీ అభిమతమైతే నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు,'' అన్నాడు.

అప్పుడు జీమూతవాహనుడు, ''కల్పవృక్షమా! తరతరాలుగా మమ్మల్ని రక్షించి

పురాణ వీరకుమారులు – 9

నందుకు కృతజ్ఞతలు. ఇక మీదట నిరు పేదల కష్టాలు తీర్చడానికి నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళు,'' అని ప్రార్థించాడు.

వెంటనే కల్పవృక్షం ఆకాశంలోకి లేచి, ప్రపంచమంతటా కనకవర్షం కురిపించింది.

కాంచనపురంలో కల్పవృక్షం లేదని తెలియ గానే శత్రువులైన జీమూతకేతుడి దాయా దులు నగరం మీదికి దండెత్తివచ్చారు. అప్పుడు జీమూతవాహనుడు, ''నేను ఖడ్గం పట్టినట్ట యితే, మీరెవరూ నిలువలేరు. అయినా నాకు అధికారం పట్ల ఆసక్తి లేదు. మనకు అధి కారం ఉన్నదే ప్రజలను కాపాడడానికి. అందుకే రాజును జగద్రక్షకుడైన విష్ణువు అంశగా చెబుతారు. నగర ప్రజలకు ఎలాంటి కొరతా రాకుండా మీరే ఏలుకోండి,'' అని చెప్పి వారికి రాజ్యాన్ని అప్పగించి, వానప్రస్థం స్వీకరించనున్న వృద్ధులైన తల్లితండ్రులను వెంటబెట్టుకుని మలయ పర్వతం చేరి వారికి పరిచర్యలు చేస్తూ కాలం గడపసాగాడు.

అక్కడతనికి విశ్వావసువు కుమారుడు మిత్రావసువుతో పరిచయమై మైత్రిగా పరిణ మించింది.

ఒకనాటి సాయంకాలం జీమూతవాహ నుడు గౌరి ఆలయ సమీపంలో వెళుతూం డగా వీనులవిందుగా వీణానాదం వినిపించ డంతో అటుమైపు తిరిగి చూశాడు. మోడుబారే చెట్లు సైతం చిగురించే విధంగా వీణవాయి స్తూన్న అందాల యువతి కనిపించింది. ఆమె కూడా జీమూతవాహనుణ్ణి చూసి సంతసిం చింది. ఉభయులూ పరస్పరం ఆకర్షితుల య్యారు. ఆ సౌందర్యరాశి తన మిత్రుడు మిత్రావసువు చెల్లెలు మలయవతి అని





తెలియడంతో జీమూతవాహనుడు మరింత ఆనందంచెందాడు. ఉభయుల తల్లిదండ్రుల సమ్మతితో మలయవతీజీమూతవాహనుల వివాహం ఆనందంగా జరిగింది.

ఒకనాడు జీమూతవాహనుడు మిత్రావసువుతో కలిసి కొండసానువుల మధ్య తిరుగుతూండగా గుట్టలు గుట్టలుగా పడివున్న పాముల ఎముకలను చూసి ఆశ్చర్యపోయాడు. అవి ఏమిటని మిత్రుణ్ణి అడిగాడు.

''తన తల్లిని అవమానపరచిన నాగుల పైబడి గరుత్మంతుడు నాశపరుస్తూండగా నాగరాజు వాసుకి అడ్డుపడి, 'ఇలా మమ్మల్ని వేధించడం మానావంటే, రోజుకొక నాగకుమారుణ్ణి నీకు ఆహారంగా పంపగలను,' అని వేడుకుని ఒప్పించాడు. ఆ ప్రకారం వచ్చిన ఒక్కొక్క నాగకుమారుణ్ణి తిని గరుత్మంతుడు వేసిన నాగుల అస్థిపంజరాలే అవి,'' అని మిత్రావసువు వివరించాడు.

ఆ మాట వినగానే జీమూతవాహనుడు తీవ్ర ఆలోచనలో పడ్డాడు. మిత్రుడు వెళ్ళిపోయినప్పటికీ, తను మాత్రం అక్కడే ఉండిపోయాడు. కొంతసేపటికి వృద్ధుల ఆర్తనాదం వినిపించడంతో అటుకేసి తిరిగి చూశాడు.

శంఖచూడుడనే నాగకుమారుడు గరుత్మంతుడికి ఆహారంగా వెళ్ళవలసి వచ్చింది. తమ ఒక్కగానొక్క కుమారుడికి కలిగిన దుస్థితిని చూసి భరించలేక అతడి తల్లిదండ్రులు హృదయ విదారకంగా విలపిస్తున్నారు. సంగతి గ్రహించిన జీమూతవాహనుడు వారిని ఓదార్చి, తాను గరుత్మంతుడికి ఆహారంగా వెళతానన్నాడు. కాని వాళ్ళందుకు అంగీకరించలేదు.

శంఖచూడుడు గోకర్ణేశ్వరుడికి మొక్కి రావడానికి వెళ్ళడంతో, ఎర్ర బట్టలు ధరించి అతనికి బదులు జీమూతవాహనుడు వెళ్ళి వధ్యశిలపై పడుకున్నాడు. అంతలో వచ్చిన గరుత్మంతుడు అతడే నాగ కుమారుడని భావించి అతణ్ణి తన్నుకుపోయి చెండుకు తినసాగాడు. ప్రతి జన్మలోనూ ఇలా పరులకు ఉపకారం చేసే బుద్ధిని ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ జీమూతవాహనుడు కళ్ళు మూసుకున్నాడు.

అంతలో వధ్యశిల వద్దకు తిరిగి వచ్చిన శంఖచూడుడు, ''వద్దు వద్దు. అతణ్ణి తిన వద్దు. అతడు నాగకుమారుడు కాడు; నేను,'' అని గరుత్మంతుణ్ణి వారించాడు.

జరిగిన పొరబాటును గ్రహించి గరుత్మంతుడు దిగ్భ్రాంతి చెందాడు. ఆ తరవాత తేరుకుని, ''జీమూతవాహనా! నా అపరాధం క్షమించు. నీ ఔదార్యం అనన్య సామాన్యం. నేనేం చేయాలో చెప్పు. ఇప్పుడే చేస్తాను,'' అన్నాడు.

''ఈ క్షణం నుంచి నాగుల పట్ల వైరం మానుకో. ఇన్నాళ్ళు చంపిన నాగులందరినీ మళ్ళీ ఎలాగైనా బతికించు,'' అని వేడుకున్నాడు జీమూతవాహనుడు.

గరుత్మంతుడు మరుక్షణమే ఇంద్రలోకానికి వెళ్ళి, ఇంద్రుణ్ణి అర్థించి అమృతం తెచ్చి ఎముకలపోగుపై చిలకరించాడు. మరణించిన నాగులందరూ పునర్జీవితులయ్యారు. జీమూతవాహనుడు మునుపటికన్నా అధిక తేజస్సుతో లేచి నిలబడ్డాడు.

సంగతి తెలిసి అక్కడికి వచ్చిన తన తల్లిదండ్రులు, భార్య మలయవతి, ఆమె తల్లిదండ్రులు, మిత్రులను చూసి జీమూతవాహనుడు సంతోషించాడు.

మలయవతి గౌరీమాతకు మనసారా కృతజ్ఞతలు తెలియజేసింది.

ఉదాత్త చరితుడైన జీమూతవాహనుడికి చేసిన దుర్మార్గానికి పశ్చాత్తాపం చెందిన అతడి దాయాదులు క్షమించమని వేడుకుని, కాంచనపుర నగరాన్ని మళ్ళీ అతనికి అప్పగించారు.

మంచితనంతో, పరోపకారబుద్ధితో అందరి మన్ననలూపొందిన పురాణ దానవీరకుమారుడు జీమూతవాహనుడు!






## ప్రతి శుక్రవారం పచ్చటి ఆకులు



పులి పస్తులున్నా గడ్డి తినదు అనే సామెత మీరు వినే ఉంటారు. అయినా అహ్మదాబాదు కమలా నెహ్రూ జంతు ప్రదర్శనశాలలోని పులులు శుక్రవారం వెదురు ఆకులు తినడం చూడవచ్చు. అవే కాదు. ఇక్కడి మరికొన్ని మాంసాహార జంతువులు కూడా పచ్చికను కొద్ది కొద్దిగా మేస్తూంటాయి.

కడుపునిండా మాంసాహారం తిన్నాక, అది బాగా జీర్ణంకావడానికి ఇక్కడి మాంసాహార జంతువులు గడ్డి, ఆకులులాంటి శాకాహారం కొద్దిగా తింటాయి.

కంకారియా జూ సూపరింటెంట్ వారానికి ఒకసారి మాంసాహార జంతువులన్నీ గడ్డి మేస్తాయని చెబుతున్నాడు. ఈ అలవాటు ఆ జంతువుల జీర్ణవ్యవస్థను క్రమబద్ధం చేయడానికి ఉపయోగపడతాయి. ఇక్కడి పులలను వారానికి ఒకసారి వెలుపలికి వదిలిపెడతారు. అప్పుడవి తమ కడుపులను శుభ్రం చేసుకోవడానికి గడ్డి, ఆకులు తింటాయి.

## నీళ్ళ మధ్య నవగ్రహ ఆలయం

రామేశ్వరానికి డెబ్భై కి.మీ. దూరంలోని దేవీపట్నం తిలకేశ్వర ఆలయం నవగ్రహదేవాలయంగానే ప్రసిద్ధి గాంచింది. శ్రీరాముడు వనవాసం చేసినప్పుడు దేవీపట్నంలోని నవగ్రహాలను పూజించాడనీ, ఆ సమయంలో ఉధృతంగా వీచిన అలలను నియంత్రించాడనీ స్థలపురాణాలు పేర్కొంటాయి. ఈ ఆలయం మొదట నీళ్ళలోపల నిర్మించబడిందని చెబుతారు.



మానవుల జీవితాలను వాళ్ళ వాళ్ళ పూర్వజన్మ కర్మలను బట్టి నవగ్రహాలు నడిపిస్తాయని హైందవపురాణాలు పేర్కొంటాయి.



# మూర్ఖుల ప్రశ్నలకు దీటైన సమాధానం

విజయం విజేతకు ఆనందాన్నిస్తుంది. అతడి మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ సంతోషాన్నిస్తుంది. తక్కిన వారిలో ఈర్ష్యాసూయలకు కారణమవుతుంది. ఇక శత్రువుల సంగతి చెప్ప నవసరం లేదు. అసూయతో కుతకుతలాడి పోతారు. బీర్బల్ విషయంలో కూడా సరిగ్గా అదే జరిగింది.

బీర్బల్ సమయస్ఫూర్తితో సమస్యలను పరిష్కరించి చక్రవర్తి అభిమానాన్ని చూరగొన్న ప్పుడల్లా సభలో కొందరు అసూయతో దహించుకు పోయేవారు. బీర్బల్‌ను చక్రవర్తి అభిమానానికి దూరం చేయడం ఎలాగా అని ఆలోచించేవారు. వాళ్ళు ఒకనాడు సమావేశమై తమ ఆశ ఫలించడానికి రకరకాల మార్గాల గురించి చర్చించారు. ఆఖరికి తిరుగులేని పథకం అని ఒక దాన్ని రూపొందించుకుని, అది గనక నెర వేరినట్టయితే బీర్బల్‌పని అయిపోయినట్టేనని సంబరపడి పోయారు!

మరునాడు అలాంటి అసూయాపరుల నాయకుడు షైతాన్‌ఖాన్ తన అనుచరులతో కాస్త ముందుగానే సభకు వచ్చాడు. ముఖ్యమైన చర్చలు, కార్యకలాపాలు పూర్తయ్యాక చక్రవర్తి సభికుల నుంచి సూచనలు, కొత్త కొత్త సలహాలు స్వీకరించడానికీ, ఆసక్తికరమైన విశేషాలు వినడానికీ సమాయత్తమయ్యాడు.

షైతాన్‌ఖాన్ లేచి నిలబడి చక్రవర్తి అనుమతి కోసం ఆగాడు. ''చెప్పు,'' అన్నాడు చక్రవర్తి.

''షహేన్‌షా! మనకందరికీ బీర్బల్ తెలివి తేటల గురించి తెలుసు. ఆయన ఎంతో కుశాగ్ర బుద్ధి కలవాడు కదా,'' అన్నాడు షైతాన్‌ఖాన్.

''గొప్ప వివేకవంతుల మధ్య ఉన్న అనుభూతి నాకు కలుగుతోంది షహేన్‌షా,'' అన్నాడు బీర్బల్ సంతోషంగా.

''నిజమే షహేనషా! చమత్కార సంభాషణలో ఆయనకు సాటి రాగలనని నేను భావించడం లేదు. అంతే కాదు. క్లిష్టమైన సమస్యలను పరిష్కరించడంలో మనలో ఏ ఒక్కరం కూడా బీర్బల్‌కు సాటి కాలేము,'' అన్నాడు షైతాన్‌ఖాన్.

ఆ తరవాత అతడు స్వరం తగ్గించి, ''బీర్బల్ ఇంత కుశాగ్రబుద్ధిగా వున్నాడు. మరి, ఆయన్ను కన్న తండ్రి మరెంత మేధావిగా ఉంటాడో కదా?'' అన్నాడు చక్రవర్తితో. ఆ మాటతో చక్రవర్తిలో కుతూహలం పుట్టుకువచ్చింది. ఇన్నాళ్ళు తనకీ యోచన రానందుకు ఆశ్చర్యపోయాడు.

''ఇంత గొప్ప వివేకిని కన్న ఆ మహామేధా విని రాజసభకు పిలిపిస్తే మనమందరం చూసి ఆనందించగలం కదా, షహేన్‌షా,'' అన్నాడు షైతాన్‌ఖాన్.

ఇందులో ఏదో తిరకాసు ఉన్నట్టు బీర్బల్ వెంటనే గుర్తించాడు. షైతాన్‌ఖాన్ అంత మంచి వాడు కాదు. తెలివైనవాడేగాని, ఆ తెలివిని మంచి పనులకు ఉపయోగించే స్వభావం కాదతనిది. కుట్రలు, కుయుక్తుల మీదే ధ్యాస.

షైతాన్‌ఖాన్ మాటల అంతరార్థం ఏమై ఉంటుందా అని బీర్బల్ ఆలోచించాడు. తన తండ్రి విద్యావంతుడు కాడనీ, నీతీ నిజాయితీతో ముక్కు సూటిగా ప్రవర్తించే వ్యక్తి అనీ అతడికి తెలుసు. పైగా రాజాస్థానంలోని వారి లౌక్యం, కపట ప్రవర్తన గురించి ఆయనకు అసలు తెలియదు. అలాంటి అమాయక వ్యక్తిని రాజసభకు పిలిచి ఆయనలోని లోపాలను బట్ట బయలు చేసి తనను దెబ్బతీయాలనుకుంటున్నాడు కాబోలు. అతడి పాచిక తన వద్ద పారదని గ్రహించలేని మూర్ఖుడు. తను తవ్విన గోతిలో తనే చతికిల పడేట్టు చేయాలి అనుకున్నాడు.

చక్రవర్తి ''బీర్బల్!'' అని పిలవడంతో అతడి ఆలోచనలకు అంతరాయం కలిగి ఆయన కేసి చూశాడు.

''మీ తండ్రిని మేము చూడాలి,'' అన్నాడు చక్రవర్తి.

''చిత్తం, ప్రభూ,'' అన్నాడు బీర్బల్ వినయంగా.

''వెంటనే మా వాహనంలో బయలుదేరి మీ గ్రామానికి వెళ్ళి ఎల్లుండికల్లా మీ తండ్రిని వెంటబెట్టుకుని రావాలి,'' అని ఆజ్ఞాపించాడు చక్రవర్తి.

''చిత్తం ప్రభూ! తమ ఆజ్ఞానుసారం ఇప్పుడే బయలుదేరుతున్నాను,'' అంటూ బీర్బల్ అక్కడి నుంచి బయలుదేరాడు.

మరునాడు తెల్లవారేసరికి వాహనం పల్లెటూరిలోని బీర్బల్ తండ్రి ఇంటి ముందు ఆగింది. బీర్బల్ వాహనం దిగి, ''నాన్నా,'' అంటూ వెళ్ళి తండ్రి పాదాలకు నమస్కరించాడు.

''ఎన్నాళ్ళకెన్నాళ్ళకు వచ్చావు నాయనా! బావున్నావా?'' అంటూ బీర్బల్‌ను లేవనెత్తిన తండ్రి అతణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. ఆ తరవాత అవీ ఇవీ మాట్లాడుకున్నాక భోజనం ముగించారు. విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు బీర్బల్ తను వచ్చిన సంగతి బయట పెట్టాడు.

''నేనా? రాజుగారి సభకు రావడమా? అక్కడ పెద్దల మధ్య ఎలా నడుచుకోవడమో కూడా



## మన దేశం క్విజ్

### ఈ నెల క్విజ్‌లో చరిత్రను గుర్తు చేసుకుందాం



1. బ్రహ్మసమాజ స్థాపకుడు ఎవరు?
2. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరచిన ఐర్లండ్ మహిళ ఎవరు?
3. నేతాజీ సుభాష్ చంద్రబోస్‌ను బర్మా మండాలే కారాగారంలో ఎప్పుడు బంధించారు?
4. మెహరున్నీసా ఒక మొగలు చక్రవర్తి భార్య. ఆమెకు మరొక పేరు కూడా ఉన్నది? అదేమిటి? చక్రవర్తి ఎవరు?
5. జైన గురువులను ఏమని పిలుస్తారు?
6. మహమ్మద్ బీన్ తుగ్లక్ తన రాజధానిని ఢిల్లీ నుంచి ఎక్కడికి మార్చాడు?
7. 1858-1947 మధ్య కాలంలో ఎంతమంది వైస్రాయిలు మన దేశాన్ని పాలించారు?
8. అక్బర్ చక్రవర్తి హిందూ భార్య ఎవరు?
9. దలైలామా భారత దేశంలో ఎప్పుడు ఆశ్రయం కోరాడు?
10. ఇండియన్ సివిల్ సర్వీస్ (ఐసిఎస్)లో మొట్టమొదట చేరిన భారతీయుడు ఎవరు?

(సమాధానాలు 74వ పేజీలో)

తెలియని పల్లెటూరి వాణ్ణి కదా?'' అన్నాడు బీర్బల్ తండ్రి.

''ఎలా నడుచుకోవాలో నేను చెబుతాను కదా? అదేం పెద్ద బ్రహ్మవిద్య కాదు. సభలో ప్రవేశించగానే వంగి నేలను నుదుటితో తాకి నమస్కరించాలి. ఆ తరవాత తలపైకెత్తుకుని వెళ్ళి మీకని నిర్దేశించిన ఆసనంలో కూర్చోవాలి. మీ పేరు, ఊరు ఉపాధి గురించి ఎవరైనా అడిగితే క్లుప్తంగా సమాధానం చెప్పాలి. ఇతర ప్రశ్న లేవైనా అడిగితే నోటితో సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వుతూ తలాడించండి చాలు,'' అన్నాడు బీర్బల్.

''మౌనం సర్వార్థ సాధకం కదా?'' అన్నాడు బీర్బల్ తండ్రి నవ్వుతూ.

''అవును, నాన్నా. మరో విన్నపం. అంతా అయ్యాక, 'ఎవరైనా ఎందుకు నోరు తెరిచి సమాధానం చెప్పలేదు?' అని గనక అడిగినట్టయితే,'' అంటూ తండ్రి చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు. ముసలి తండ్రి ఆ మాటకు నవ్వు ఆపుకోలేక పకపకా నవ్వాడు.

మరునాడు బీర్బల్ తండ్రిని వెంటబెట్టుకుని చక్రవర్తి సభలో అడుగు పెట్టాడు. బీర్బల్ నేలను నుదుటితో తాకి లేచి వెళ్ళి ఆసనంలో కూర్చున్నాడు. తండ్రి కూడా అదే విధంగా వంగి నేలను నుదుటితో తాకి నమస్కరించాడు.

''పెద్దలకు స్వాగతం! రండి! కూర్చోండి,'' అన్నాడు చక్రవర్తి మందహాసంతో.

బీర్బల్ తండ్రి, ''షహేన్‌షా!'' అంటూ మరొకసారి నమస్కరించి, వెళ్ళి కొడుకు పక్కన ఉన్న ఆసనంలో కూర్చున్నాడు.

''మిమ్మల్ని చూడడం మాకెంతో సంతోషంగా ఉన్నది. మీ కుమారుడు ఒక అనర్ఘ రత్నం. అతడు

గొప్ప మేధావి. ఎలాంటి క్లిష్ట సమస్యకైనా చిటి కెలో పరిష్కారం చెప్పగలడు. అతణ్ణి కన్నందుకు మీరు గర్వించాలి,'' అన్నాడు చక్రవర్తి.

బీర్బల్ తండ్రి చిన్నగా నవ్వుతూ, వినయంగా తల పంకించాడు తప్ప పెదవి విప్పలేదు.

''షహేన్‌షా! ఈ జ్ఞాన వృద్ధుణ్ణి చూడడానికి మాకూ ఎంతో సంతోషంగా ఉన్నది. ఆయన మాకందరికీ కూడా తండ్రిలాగా కనిపిస్తు న్నాడు,'' అంటూ షైతాన్‌ఖాన్, ఆయనతో మరింత సేపు మాట్లాడడానికి అనుమతి కోరు తున్నట్టు చక్రవర్తి కేసి చూశాడు.

చక్రవర్తి అనుమతిస్తున్నట్టు చేయి ఊపాడు.

షైతాన్‌ఖాన్ చుట్టపక్కల ఒకసారి పరిశీల నగా చూసి, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బీర్బల్ తండ్రి వద్దకు వెళ్ళి, వంగి ఆయన పాదాలు తాకి నమస్కరించాడు.

''దీర్ఘాయుష్మాన్ భవ!'' అంటూ బీర్బల్ తండ్రి అతడి తలను తాకి ఆశీర్వదించాడు.

''బాబాజీ! మీ కొడుకు ఈ రాజ్యంలో అందరికన్నా తెలివైనవాడు. మరి అతణ్ణి కన్న మీరు మరెంత మేధావంతులో కదా?'' అన్నాడు షైతాన్‌ఖాన్.

బీర్బల్ తండ్రి మందహాసం చేస్తూ తల పైకెత్తి చూశాడు.

''అతడు మీకు చాలా అమూల్యమైన వాడు కదా?'' అని అడిగాడు షైతాన్‌ఖాన్.

బీర్బల్ తండ్రి మెల్లగా తలపంకించాడు.

''అతడు మీపట్ల భక్తి శ్రద్ధలతో మీ అవస రాలన్నీ సమకూరుస్తున్నాడా?'' అని అడిగాడు షైతాన్‌ఖాన్.

పెద్దాయన మళ్ళీ మందహాసంతో తల పంకించాడు.



''మన చక్రవర్తి గురించి తమరేమనుకుంటు న్నారు?'' అని అడిగాడు షైతాన్‌ఖాన్ ఆయన్ను ఇరుకులో పెట్టాలని.

పెద్దాయన నవ్వి మౌనంగా ఊరుకున్నాడు.

షైతాన్‌ఖాన్ మళ్ళీ అదే ప్రశ్న అడిగాడు. పెద్దాయన చిరునవ్వు నవ్వాడుగాని ఒక్క మాట ఆయన నోటి నుంచి బయట పడలేదు.

అప్పుడు బీర్బల్ లేచి నిలబడి చక్రవర్తితో, ''షహేన్‌షా! ప్రభువులంటే ఆయనకు మహా గౌరవం. సాటిలేని తమ ధర్మబుద్ధిని గురించి బాగా తెలుసు. వినయశీలి; విశ్వాసపాత్రుడైన పౌరుడు గనక తమ ఎదుట ఆ మాట అనడా నికి ఆయనకు నోరు పెగలటం లేదు. మేటి మొగల్ చక్రవర్తిని గురించి న్యాయనిర్ణయం చేయవలసింది మనం కాదు. సాధారణ ప్రజలు. మా తండ్రికి దైవభీతి ఎక్కువ. మేమందరం అనునిత్యం తనలో దైవాన్ని సందర్శిస్తున్నాం.

అటువంటి తమను గురించి ఆయన న్యాయ నిర్ణయం చేయడానికి సాహసించలేకపోతున్నాడు. అందువల్లే ఆయన నోటి నుంచి ఒక్క మాట కూడా వెలువడడం లేదు,'' అన్నాడు.

చక్రవర్తి పరమ సంతోషంతో, ''మీ స్వభావం మాకెంతో ఆనందం కలిగించింది,'' అన్నాడు బీర్బల్ తండ్రితో.

బీర్బల్ తండ్రి లోకజ్ఞానం లేని నిరక్షరాస్యుడన్న సంగతి బట్టబయలు చేయాలనుకున్న తన ప్రయత్నం విఫలం కావడంతో, షైతాన్ ఖాన్ ఆశాభంగానికి లోనయ్యాడు. తన సహచరుల కేసి చూశాడు. వాళ్ళు అడిగిన ప్రశ్నలకు కూడా బీర్బల్ తండ్రి, తలను రకరకాల భంగిమలతో అటూ ఇటూ మెల్లగా ఊపాడు తప్ప, నోరు తెరిచిన పాపాన పోలేదు.

విసుగు చెందిన షైతాన్‌ఖాన్ లేచి, ''షహేన్‌షా!'' అన్నాడు.



''ఏమిటి షైతాన్‌ఖాన్? చెప్పు,'' అని అడిగాడు చక్రవర్తి.

''ఈ వృద్ధుడికి ఏమీ తెలియదని నా అనుమానం. మౌనంతో తన అజ్ఞానాన్ని కప్పి పుచ్చుకుంటున్నాడు,'' అన్నాడు షైతాన్‌ఖాన్.

సభలో గుసగుసలు బయలుదేరాయి.

''ఆ వృద్ధుణ్ణి అలా కించపరచడం భావ్యమేనా?'' అని అడిగాడు చక్రవర్తి.

అంతలో పెద్దాయన ఏదో చెప్పదలచినట్టు చెయ్యి పైకెత్తి, ''ప్రభూ! మూర్ఖుల ప్రశ్నలకు మౌనమే సరైన సమాధానం అని నేను సవినయంగా మనవి చేసుకుంటున్నాను,'' అన్నాడు గంభీరంగా.

''మౌనానికి గల శక్తి వివేక సంపన్నులు మాత్రమే గ్రహించగలరు. నిజంగా తమరు వివేకవంతుణ్ణి కన్న జ్ఞాన సంపన్నులు,'' అంటూ చక్రవర్తి, తన చేతి బంగారు కడియాన్ని తీసి బీర్బల్ తండ్రి చేతికి తొడిగాడు.

పెద్దాయన వంగి నేలను తాకి నమస్కరించి లేచి నిలబడ్డాడు.

''షహేన్‌షా! వృద్ధుడైన మా తండ్రి సుదూర ప్రయాణం కారణంగా బాగా అలిసిపోయారు. ఆయనకు విశ్రాంతి కావాలి. తమ అనుమతితో తీసుకువెళ్ళమంటారా?'' అని అడిగాడు బీర్బల్.

''అలాగే బీర్బల్. ఆయన గొప్పవివేకి మౌనం శక్తి ఎరిగిన జ్ఞాని. మూర్ఖుల ప్రశ్నలకు దీటైన సమాధానం మౌనం అని నిరూపించాడు కదా!'' అంటూ బిగ్గరగా నవ్వుతూ సభికుల కేసి చూశాడు.

షైతాన్‌ఖాన్, అతడి అనుచరుల ముఖాలు సిగ్గుతో వెలవెలబోయాయి.

ఉదయ తారలు:

# షుభమ్ రాథోడ్



- నోయిడాలోని రోలర్ స్కేటింగులో షుభమ్ శిక్షణ పొందుతున్నాడు.
- రోజూ రింక్‌లో రెండు గంటలు శిక్షణ పొందే ఇతడు వారాంతాలలో 35 కి.మీ. రోడ్‌పై పరుగులు తీస్తాడు.
- స్కేటింగ్‌తో పాటు షుభమ్ అభిమాన క్రీడ ఫుట్‌బాల్.
- షుభమ్ రోల్‌మాడల్ - అమెరికన్ ఇన్‌లైన్ స్పీడ్ స్కేటర్ సుసీ జాక్సన్.
- అభిమాన పాఠ్యాంశం గణితం.
- నవంబర్ '08 వరకు అతడు స్థానిక, జాతీయ స్థాయి పోటీలలో, 5 ఛాంపియన్‌షిప్ పోటీలలో, 72 బంగారు, 13 వెండి, 3 కాంస్య పతకాలను కైవసం చేసుకున్నాడు.

''స్పీడ్ స్కేటింగ్ అంటే నాకు ఇష్టం. వేగం నా ప్రాణం,'' అంటాడు తొమ్మి దేళ్ళకే 72 బంగారు పతకాలు సాధించిన నేషనల్ జూనియర్ స్కేటింగ్ ఛాంపియన్ షుభమ్ రాథోడ్.

మరి కొందరు ఉత్సాహవంతులైన పిల్లలతో కలిసి రోజూ అతడు స్కేటింగ్ రింక్‌లో శిక్షణ పొందుతున్నాడు. తన అభిమాన క్రీడకూ, చదువులకూ అతడు సమానమైన ప్రాముఖ్యతను ఇస్తున్నాడు. శని ఆది వారాలలో 35 కి.మీ. రోడ్ ప్రాక్టీస్ చేయడం అతడి శిక్షణలో అంతర్భాగం. ఈ క్రీడకు అంటూ ఆహారపుటలవాట్లలో అతడు ప్రత్యేకంగా జాగ్రత్తలు తీసుకోవడం లేదుగాని, కోచ్ ఏదైనా సలహాలు సూచనలు చెబితే మాత్రం జాగ్రత్తగా విని పాటిస్తాడు. అతడు చదువుతూన్న ఫాదర్ ఏంజెల్ స్కూల్ అతడు వివిధ ఛాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొనడానికి అవసరమైన ప్రోత్సాహాన్ని ఇస్తోంది. పరీక్షలకు సిద్ధం కావడానికి అదనపు సమయం కేటాయిస్తోంది.

కష్టపడి శిక్షణ పొంది తల్లి తండ్రులకు పేరు తీసుకురావాలని అతడు సాటి క్రీడాకారులకు చెబుతాడు. తానొక ఒలింపిక్ స్టార్‌గా అంతర్జాతీయ క్రీడారంగంలో భారత దేశాన్ని ప్రజ్వరిల్ల చేయాలన్నదే తన కాంక్షగా షుభమ్ రాథోడ్ చెబుతున్నాడు.




తన లక్ష్య సాధనకు ఆశయ శిఖరాన్ని అధిరోహించడానికి అతడు ఎంతో ఎదగవలసి ఉన్నది. ఎంతో శ్రమించవలసి ఉన్నది. సమున్నత లక్ష్యంతో ముందుకు సాగుతూన్న ఈ ఉదయ తారను చందమామ వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ శుభాభినందనలు తెలియజేస్తున్నది!

థాయ్‌వాన్ జానపద కథ

# బాన్ పిన్ షాన్

"రుచికరమైన వేడి వేడి కుడుములు. ఒకటి పది సెంట్లు. రెండు ఇరవై సెంట్లు. మూడు ఉచితంగా!"

పిన్‌షాన్ కొండ పాదతలంలోని చిన్న గ్రామంలోని ప్రజలు తమ చెవులను తామే నమ్మలేక పోయారు. కుడుములు ఉచితంగా ఇచ్చే ఆ మూర్ఖుడు ఎవరా అని ఆశ్చర్యపోయారు.

ఆ కంఠస్వరం ఒక ముసలాయనది. చిరిగిన బట్టలతో, ఒక మర్రిచెట్టు కింద కూర్చుని ఉన్నాడు. ముఖం ముడతలు పడి ఉంది. అయితే, కళ్ళు మాత్రం మెరుస్తున్నాయి. ఆయన ముందున్న బుట్టనిండా కుడుములు ఉన్నాయి.

"గుండ్రటి కుడుములు. అర్ధ చంద్రాకార కుడుములు. ఉడికించిన కుడుములు. వేయించిన కుడుములు. కోడి కాళ్ళ కుడుములు, మాంసం కుడుములు, చేపల కుడుములు, కూరగాయల కుడుములు!" అంటూ స్పష్టమైన కంఠస్వరంతో అందరినీ పిలుస్తున్నాడు.

ఆయన మాటలు జనానికి నోరూరించాయి. నిమిషాల్లో ఆయన చుట్టూ మూగారు. కుడుములు వాళ్ళ అభిమాన వంటకం. వాళ్ళకే కాదు. దేశ ప్రజలందరికీ కుడుములంటే చాలా ఇష్టం. పిండితో తయారు చేసిన వాటి లోపల మాంసం, కోడి మాంసం, ఉడికించిన కూరగాయలు, తీపి పదార్థాలు నింపుతారు. అలాంటి కుడుములు ఉచితంగా వస్తున్నాయంటే ఏ థాయ్‌వాన్ పౌరుడూ అందుకోకుండా ఊరుకోడు.

"రండి. ఆలస్యం చేయకండి. వెంటనే కొనండి. ఒకటి తినండి; పది సెంట్లు ఇవ్వండి. రెండు తినండి; ఇరవై సెంట్లు చెల్లించండి. మూడు తినండి; ఒక్క సెంటు కూడా వద్దు. సంతోషంగా వెళ్ళండి," అని పిలువసాగాడు ముసలాయన మళ్ళీ.

"నేను తింటాను మూడు!" అంటూ ఆ గ్రామంలోకెల్లా లావుపాటి మనిషయిన బిగ్ హెడ్ వాంగ్ ముందుకు వచ్చాడు. తినడానికి అవకాశం వస్తే అతడు వదులుకునే ప్రసక్తే ఉండదు. "ఒక కోడిమాంసం కుడుము, ఒక చేపల కుడుము, కరకరలాడే బియ్యం కుడుము ఒకటి ఇవ్వు," అన్నాడు.

ముసలాయన బుట్ట నుంచి మూడు కుడుములు తీసి ఇచ్చాడు. ఒక్కొక్కటి చాలా పెద్దదిగా

## చందమామ క్విజ్ - 11 సమాధానాలు

1. ఫా-హ్యాన్ 2. 1954 నవంబర్ 1 3. భారత ప్రధాని అయ్యారు 4. సర్ థామస్ రో; 1615 5. 1960 మే 1 5. జవహర్‌లాల్ నెహ్రూ సహోదరి; 1953 యునైటెడ్ ప్రావిన్స్ ముఖ్యమంత్రి. సోవియట్ యూనియన్‌లో భారత రాయబారి 6. ఢిల్లీ నుంచి పాలించిన తొలి మహిళ; ఇల్తుమిష్.

ఉంది. అందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.



బిగ్‌హెడ్ వాంగ్ వాటిని లాక్కున్నట్టు అందుకుని మొదట కోడిమాంసం కుడుము తినేశాడు. ఆ తర వాత చేపల కుడుమును తిని బ్రేవ్ మని త్రేన్చాడు. దాంతో అతడి కడుపునిండిపోయింది. లేచి అడుగు ముందుకు వేయడం కూడా కష్టమని పించింది. మూడో కుడుము రాత్రికి తిందామని తీసుకుని లేవబోయాడు. అప్పుడు ముసలా యన, ''ఆగు... ఆగు... ఇరవై సెంట్లు ఇవ్వు నాయనా,'' అన్నాడు.

''ఏమిటీ! ఇరవై సెంట్లా? మూడు ఉచితం అని నువ్వే చెప్పావు కదా?'' అని అరిచాడు బిగ్‌హెడ్.

''మూడూ నువ్వు తింటేనే ఆ మాట!'' అన్నాడు ముసలాయన నెమ్మదిగా.

''ఏమిటీ!'' అని ఆశ్చర్యపోయిన బిగ్‌హెడ్, ''ఎందుకలా?'' అని అడిగాడు.

''అది నిబంధన. నా ఎదుట నువ్వు ఆ మూడూ తిన్నట్టయితే, నువ్వేమీ చెల్లించన వసరం లేదు. మూడో దాన్ని నువ్వు ఇంటికి తీసుకువెళ్ళే పక్షంలో ముప్ఫై సెంట్లు చెల్లిం చాలి,'' అని వివరించాడు ముసలాయన.

''అలాగా!'' అంటూ తల గోక్కున్న బిగ్ హెడ్ వాంగ్, ''మూడూ తినేస్తే డబ్బు చెల్లించ వలసిన అవసరం లేదు కదా?'' అని అడిగాడు.

''అవును. నిజమే. చెల్లించనవసరం లేదు,'' అన్నాడు ముసలాయన నర్మగర్భంగా నవ్వుతూ.

వెంటనే బిగ్‌హెడ్ వాంగ్ చేతిలోని బియ్యం కుడుమును నోట్లో కుక్కుకుని నమిలి బలవం తంగా మింగాడు. అది లోపలికి తిగక పోగా లోపల ఉన్నవి బయటకు తన్నుకు రాసా గాయి. కాని, బిగ్‌హెడ్ వాటిని బలవంతంగా కడుపులోనే అదిమి పట్టి, ''చూశావా! మూడు కుడుములూ తినేశాను,'' అన్నాడు.

ముసలాయన వెళ్ళమన్నట్టు చేయి ఊపాడు. ఒక్క సెంటు కూడా ఇవ్వకుండా అతడు వెళ్ళడం చూసిన తక్కిన గ్రామస్థులు ముసలా యన బుట్ట చుట్టూ మూగారు.

''నాకో మూడు! మూడు నాకు! నాకు మూడు ఇవ్వు!'' అన్న కేకలతో గ్రామం పొలి మేర మారుమోగింది. ముసలాయన అడిగిన ఒక్కొక్కరికీ మూడేసి కుడుములు తీసి ఇవ్వ సాగాడు. దాదాపు గ్రామస్థులందరూ కుడు ములు తిన్నారు. బరువెక్కిన కడుపులతో నడవ లేకపోయారు. మాట్లాడలేక పోయారు. రొప్పుతూ రోజుతూ అపసోపాలు పోతూ మర్రి చెట్టు కింద కూర్చుండిపోయారు.

''నాకో రెండు కుడుములు ఇస్తారా?'' అని అడిగింది ఒక చిన్న గొంతుక.

తలెత్తి చూసిన ముసలాయనకు ఒకపదేళ్ళ కుర్రాడు కనిపించాడు. అతడి చేతిలో కొన్ని నాణాలు కనిపించాయి. ''ఇదిగో డబ్బు. రెండు తియ్యటి కొబ్బరి కుడుములు ఇవ్వండి,'' అని అడిగాడు వాడు వినయంగా.

మర్రి చెట్టు కింద పడి పొర్లుతూన్న గ్రామస్థులు తలలెత్తి చూశారు. ''మూడు తీసుకో మింగ్. ఉచితంగా వస్తాయి. నువ్వేమీ అతనికి చెల్లించనవసరం లేదు,'' అని అరిచాడు బిగ్‌హెడ్ వాంగ్.

''నాకు మూడు అవసరం లేదు. నాకొకటి, మా అమ్మకు ఒకటి చాలు,'' అని చెప్పిన మింగ్ మళ్ళీ, ''మా అమ్మ చాపలమ్ముతుంది. వాటిని తయారు చేయడానికి మా అమ్మ రోజూ ఎంత కష్టపడుతుందో నాకు తెలుసు. ఆమె చాపలకు ఎవరైనా డబ్బులివ్వకపోతే నాకు కోపం రాదూ. ఈ పెద్దాయన రుచికరమైన ఈ కుడుములు తయారు చేయడానికి ఎంతో కష్టపడి ఉంటాడు కదా? ఆయన కష్టానికి తగ్గ ఫలితం ముట్టచెప్పడమే న్యాయం,'' అన్నాడు.

ఆ కుర్రవాడి మాటలకు ముసలాయన చిన్నగా నవ్వాడు. ఆ క్షణమే ఆయన అక్కడి నుంచి అదృశ్యమైపోయాడు. అందరూ దిగ్భ్రాంతితో చూస్తూండగా ఆకాశం నుంచి గంభీర కంఠస్వరం వినిపించింది: ''పిన్‌షాన్ పర్వత దేవుణ్ణయిన నేనే వృద్ధుడిలా వచ్చాను. నా వారసుడిగా ఉండడానికి తగిన నిజాయితీ పరుణ్ణి ఎంపిక చేయదలచాను.మింగ్ లభించాడు!''

''తక్కిన మీ అందరికీ మరో మాట. మీరు తిన్న కుడుములన్నిటిలోనూ నా పర్వతం నుంచి తీసిన మన్నును నింపాను!'' అన్న మాటలు మళ్ళీ వినిపించాయి.

ఆశాపరులైన గ్రామస్థులు హడలిపోయి లేచి తమ ఇళ్ళకేసి పడుతూ లేస్తూ పరిగెత్త సాగారు. వాంతులు చేసుకున్నారు. కొంత సేపటికి నిస్సత్తువతో వెలుపలికి వచ్చి ఆకాశం కేసి చూశారు. మింగ్‌ను స్వయంగా పర్వత దేవుడే మేఘాల మీద పర్వతం కేసి తీసుకువెళ్ళడం కనిపించింది!



ఇవాళ కూడా, దక్షిణ థాయ్‌వాన్ కావోసి యంగో పట్టణానికి వెళ్ళినట్టయితే అక్కడ వింత ఆకారంతో కనిపించే కొండను చూడవచ్చు. దాన్ని బాన్ పిన్ షాన్ అంటారు. 'అందులో సగం' అని దానికి అర్థం. దాని ఆకారం మామూలు కొండలా కనిపించదు. ఎవరో పనికట్టుకుని కత్తితో రెండుగా తెగనరికి రెండవసగాన్ని మాత్రం అక్కడ ఉంచినట్టు కనిపిస్తుంది.

యురేకా!

# పేలుతూన్న అగ్నిపర్వతం తయారుచేద్దామా!




అగ్నిపర్వతం అనగానే అద్భుతం అనుకుంటారు కదూ! ఇంట్లోనే సురక్షితమైన అగ్నిపర్వతం సులభంగా తయారు చేయడం ఎలాగో ఇప్పుడు నేర్చుకుందాం.

కావలసిన వస్తువులు:

పేపర్ కప్, టిన్ ఫాయిల్, మోడలింగ్ క్లే, ట్రే (పళ్ళెం) లేదా కార్డ్‌బోర్డ్.

లావా తయారీకి:

బేకింగ్ (వంట) సోడా, వయిట్ వెనిగర్, డిష్ వాష్ లిక్విడ్, ఫుడ్ కలర్స్ (పసుపు, ఎరుపు)

తయారు చేయడం ఎలా?

- పళ్ళెం లేదా కార్డ్‌బోర్డ్ షీట్ తీసుకుని దాని మధ్యలో పేపర్ కప్ ఉంచండి. దాని చుట్టూ టిన్ ఫాయిల్ చుట్టండి. కప్ అంచుల మీద ఫాయిల్ ముడతలు వచ్చేలా చూడండి.
- మిగిలివున్న ఫాయిల్‌తో పర్వత ఆకారం పోలినట్టు మడిచి చుట్టండి. ఇందుకు మరో రెండు ఫాయిల్స్ కావలసి రావచ్చు. పేపియర్-మాష్‌ని ఉపయోగించి అందమైన పర్వతం తయారు చేసుకోవచ్చు.
- టిన్ ఫాయిల్ మీద, కప్పు అంచులపైన మోడలింగ్ క్లేను ఉపయోగించి చక్కటి పర్వత రూపం తీసుకురావచ్చు.
- ఫుడ్ కలర్స్‌తో చెరో టీస్పూన్ తీసి కప్పులో వేసి బాగా కలపండి.
- మూడు టీస్పూన్ల బేకింగ్ సోడా, ఒక టీస్పూన్ డిష్‌వాష్ లిక్విడ్ అందులోకి వేయండి.
- ఇప్పుడు ఆ మిశ్రమానికి చిన్న కప్పు వెనిగర్ కలపండి.
- ఇదిలావా పెల్లుబికే సమయం! లావా పొంగి రావడం చూడండి!



కాన్సెప్ట్:

వెనిగర్, బేకింగ్ సోడా (సోడియం బైకార్బొనేట్) మిశ్రమం రసాయనిక మార్పు చెందడంతో కార్బన్ డైయాక్సైడ్, నీరు బుసబుస పొంగుతాయి. ఆమ్లానికీ, మూలానికీ మధ్య జరిగే రసాయనిక మార్పు ఇది. మిశ్రమానికి డిష్‌వాష్ లిక్విడ్ జిగురు స్వభావం కలిగించి మరింతగా లావా లాగా కనిపించడానికి తోడ్పడుతుంది!

# మళ్ళీ సొంత గ్రామానికి...

ముప్పైయేళ్ళ అందమైన యువకుడు టాక్సీలో వస్తున్నాడు. అతడి అధునాతనమైన సూటూ, పెర్‌ఫ్యూమ్ చూస్తూంటే నగరం నుంచి వస్తున్నా డని ఇట్టే తెలిసిపోతుంది. రాజస్థాన్ ఆరావళీ కొండల మధ్య ఉన్న స్నేహ-కా-మలా అనే కుగ్రామానికి వస్తూన్న ఆ యువకుడి పేరు అరవింద్ గుజ్జార్. తండ్రిని కరువు బలితీసు కోవడంతో పధ్నాలుగేళ్ళ కుర్రాడిగా తన గ్రామాన్ని వదిలి వెళ్ళిన అరవింద్ ఇప్పుడు తిరిగి వస్తున్నాడు.

గ్రామాన్ని సమీపిస్తూండగా గతాన్ని గురిం చిన జ్ఞాపకాలు అతడి మనసులో ఒక్కొక్కటిగా కదలాడసాగాయి...

ఆకలి దప్పులను తట్టుకోలేక అతడు పొట్ట చేత పట్టుకుని ముందూ వెనకా తెలియని నగరం కేసి బయలుదేరి వెళ్ళిపోయాడు. గ్రామంలో బక్కచిక్కిన తల్లి; అయితే చాలా మంగళకరమైన రూపం. రంగుల రవిక, ఎర్రటి 'పళ్ళూ'తో అమ్మ దేవతలా కనిపించేది. పెరట్లో గడ్డిగాదం లేక చిక్కిపోయిన గేదె మాయీ, దాని దూడ. అందంగా నవ్వే మిత్రుడు గోపాల్...

"గ్రామం వచ్చేసింది బాబూ," అన్న డ్రైవర్ పిలుపుతో ఊహల నుంచి బయటపడ్డ అరవింద్, చుట్టుపక్కల కలయ జూశాడు. అంతా వచ్చగా ఉండడం చూసి అది తన గ్రామమేనా అని ఆశ్చర్యపోయాడు. ఆ రోజుల్లో తన తల్లి కడి వెడు మంచి నీళ్ళ కోసం, వంటచెరకు కోసం ఎర్రని ఎండలో మైళ్ళకు మైళ్ళు నడిచి వెళ్ళి రావడమే అతడికి తెలుసు.

ఊరేగింపు ఏదో రావడం చూసి అరవింద్ టాక్సీ నుంచి దిగి, చెట్టు నీడలో నిలబడ్డాడు.

ఊరేగింపుకు ముందుగా తెల్లటి దుస్తు లతో పిల్లలు వస్తున్నారు. వారి వెనక రంగు రంగుల దుస్తులలో పెద్దలు. దాపుల ప్రవ హించే రూపారెల్‌నది అందచందాలనూ, గుణ గుణాలనూ కీర్తిస్తూ దానికి తమ కృతజ్ఞతలు



## చందమామ క్విజ్ - 11 (డిసెంబర్ '08) విజేతలకు అభినందనలు

1. ఎం.కె. చంద్రహాసన్, యాప్రాల్ - 500 087; 2. పక్కిసాయి భరద్వాజ్, హైదరాబాద్-- 500 087 ; 3. ఎ. శశాంక్, కల్యాణ ఖని (పోస్ట్) 504 231 ; 4. జి. రంజిత్, విశాఖపట్నం ; 5. వెంకు మహంతిప్రత్యూష, గాజువాక, విశాఖపట్నం - 500 026

తెలియజేస్తూ వాళ్ళు పాటలు పాడుతూ వస్తున్నారు. ఆ గుంపు నుంచి వచ్చిన ఒక వ్యక్తి అరవిందును సమీపించి, ''ఎక్కడికి వెళ్ళాలి బాబూ?'' అని అడిగాడు.

''స్నేహ్-కా-మలాకు వెళ్ళాలి,'' అని చెబుతూండగానే, ఆ వ్యక్తి నవ్వుతూ, ''నేను ఆ గ్రామం సర్పంచిని,'' అన్నాడు. అరవింద్ అతణ్ణి గుర్తుపట్టి, ''గోపూ, నేను నీ మిత్రుడు అరూను,'' అంటూ అడుగు ముందుకు వేశాడు. ఇద్దరూ పరమానందంతో ఒకరినొకరు కౌగిలించుకున్నారు. ''నిన్ను చూస్తే మీ అమ్మ చాలా సంతోషిస్తుంది,'' అన్నాడు గోపాల్.

ఆ తరవాత అరవింద్ ఇంటికి దారి చూపి, తరవాత వచ్చి కలుస్తానని చెప్పి గోపాల్ ఊరేగింపుతో వెళ్ళిపోయాడు.

చుట్టు పక్కలు కలయజూస్తూ అమితాశ్చర్యంతో అరవింద్ తన ఇంటి కేసి నడిచాడు. కొడుకును చూడగానే తల్లి ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. ఆమె కొడుకు తలనిమురుతూ, ఆనంద బాష్పాలు రాల్చింది. ఇంట్లోకి తీసుకువెళ్ళి రొట్టెలు చేసి పెట్టింది.

అరవింద్ వచ్చాడని తెలియగానే గ్రామస్థులు ఒకరి వెంట ఒకరు వచ్చి అతణ్ణి చూసి, పలకరించి ముక్కున వేలేసుకున్నారు. అయితే, తను పుట్టి పెరిగిన గ్రామపరిసరాలలో వచ్చిన మార్పును చూస్తూంటే అరవింద్‌కు అంతకన్నా ఎక్కువ ఆశ్చర్యం కలిగింది. గ్రామంలో వెనకటి పేదరికం లేదు. అందరూ ఆరోగ్యంగా, సంతోషంగా కనిపించారు. తనను చూడడానికి వచ్చిన గోపాల్‌ను, ''ఇదంతా ఎలా సాధ్యమయింది? దీనికంతా కారణం ఏమిటి?'' అని అడిగాడు అరవింద్.

''మన పూర్వులు కురిసే కొద్దిపాటి వర్షపు నీటిని సేకరించాడనికి కొండల దిగువ మట్టి గోడలతో జోహాదులనే కొలనులను, అర్ధచంద్రాకార అడ్డుకట్టలను నిర్మించే వారని విన్నావు కదా? సంవత్సరం పొడవుగా రూపారెల్ నది ప్రవహించేదని చెప్పుకోవడం గుర్తుంది కదా? నువ్వు ఊరు వదిలి వెళ్ళాక మన గ్రామానికి కొందరు శ్రేయోభిలాషులు వచ్చారు. వాళ్ళు చదువుకున్న యువతీ యువకులు. సంఘ సేవకులు. మన ప్రాంతం నుంచి కరువు కాటకాలను పారదోలాలనుకున్నారు. పాతకాలపు జోహాద్‌ల గురించీ, అడ్డుకట్టల గురించీ పెద్దల నుంచి అడిగి తెలుసుకున్నారు. ఆ సంప్రదాయ పద్ధతులను మనకు అనుకూలంగా ఇప్పుడు ఉపయోగించుకోవడం ఎలాగో తెలియజెప్పారు. మరిచిపోయిన వాటిని పకట్బందీగా అమలు చేయడం ఎలాగో గ్రామస్థులకు వివరించారు.



ఆ తరవాత మన గ్రామంలోని పురుషులు, స్త్రీలు, పెద్దలు పిన్నలు ఆ సంఘసేవకులతో చేతులు కలిపి పాత కొలనులను, అడ్డుకట్టలను పునరుద్ధరించారు. వర్షాకాలంలో నీళ్ళు చేరడం ఆరంభమయింది. భూగర్భ జలాల మట్టం పెరగడంతో చెట్టు చేమలతో పరిసరాలు పచ్చదనం సంతరించుకున్నాయి. మొదట నీళ్ళు బొటాబొటిగా సరిపోయాయి. కాని మరుసటి సంవత్సరం నుంచి ఏరు ఎండటం అన్నది జరగలేదు. పంటలు పండించడం మొదలు పెట్టాం. కూలీనాలీ వెతుక్కుంటూ పట్నాలకు చేరిన కొందరు గ్రామస్థులు తిరిగి వచ్చి వ్యవసాయం మొదలు పెట్టగానే పాడి పంటలు అభివృద్ధి చెందాయి.

ఇవాళ అతి కొద్ది దూరంలోనే తాగునీరు లభ్యమవుతోంది. కుటుంబ పోషణకు పోను మిగిలిన ధాన్యాన్ని అమ్ముకుంటున్నాం. పశు సంపద పెరిగింది. కుటుంబ ఆదాయం పెరిగింది. అన్నిటికీ మించి మా విలువను, మా శ్రమ శక్తి విలువను, సంప్రదాయ విధానాల విలువలను గుర్తించాము. మా పాత విజ్ఞానాన్ని మళ్ళీ నేర్చుకున్నాం. జీవితాలను సుఖమయం చేసుకున్నాం,'' అని ముగించాడు.

''పరిష్కారాలను మన దగ్గరే ఉంచుకుని ఇన్నేళ్ళు సమస్యలతో సతమతమయ్యాం,'' అన్న అరవింద్ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

తన మిత్రుడు గోపాల్‌ను వెంటబెట్టుకుని వెళ్ళి నగరంలో ఏదైనా జీవనోపాధి ఏర్పాటు చెయ్యాలనే ఉద్దేశంతోనే అరవింద్ వచ్చాడు. అయితే, తన మిత్రుడు తన స్వస్థలాన్ని సస్యశ్యామలమైన స్వర్గంగా మార్చడం చూసి పరమానంద భరితుడయ్యాడు. ఇక తను కూడా పుట్టి పెరిగిన గ్రామాన్ని వదిలి వేరెక్కడికీ వెళ్ళకూడదన్న నిర్ణయంతో స్వచ్ఛమైన చల్లటి గాలిని గుండెలనిండుగా పీల్చుకున్నాడు.

-ఎరికా తారాపుర్‌వాలా

# వార్తలలో బాలలు

## అతి పిన్నవయసు కేంబ్రిడ్జ్ స్కాలర్

ఎనిమిదేళ్ళ ప్రాయంలో మామూలుగా పిల్లలు ఆటల పట్ల ఆసక్తి కనబరుస్తారు. అయితే, అదే ప్రాయంలోని నాయ్‌నా అనే అమ్మాయి గత జూన్‌లో కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం నిర్వహించిన గ్రేడ్ టెన్ ఐజిసిసె పరీక్షలో ఉత్తీర్ణురాలయింది. దక్షిణ ఆసియాలో ఆ పరీక్షలో ఉత్తీర్ణురాలయిన అతి పిన్న వయస్కురాలుగా నిలిచింది.

ఇప్పుడు ఆ బాలమేధావి దృష్టి బాకాలారేట్ మీద కేంద్రీకరించబడి ఉన్నది. ''ఒకటవ తరగతి చదువుతున్నప్పుడే చదువు పట్ల ఆమెకున్న ఆసక్తినీ, శక్తినీ గమనించిన ఆమె తండ్రి అశ్వనీకుమార్, ఆమె చదువుకోవడానికి తగ్గ ఆహ్లాదకర వాతావరణాన్నీ, వసతులనూ కల్పించాడు. దాంతో ఆమె హాయిగా చదువుకో కలిగింది,'' అంటున్నారు ఆమె తల్లి భాగ్యలక్ష్మి.

పెద్దలకు సైతం కష్ట సాధ్యమైన అంతటి సమాచారాన్ని ఈ చిన్నారి తన బుల్లి బుర్రలో ఎలా నింపుకోగలుగుతున్నది? ''అందుకామె బట్టీపట్టడం లేదు. పాఠ్యాంశాలను ప్రాథమిక స్థాయి నుంచి ఒక్కొక్క అంశంగా బాగా అర్థం చేసుకుని చదువుతుంది. అందువల్ల ప్రశ్నలు అడిగిందే తడవుగా సమాధానాలు చకచకా వచ్చేస్తాయి,'' అని వివరిస్తున్నారు ఆమె తల్లి.

## కందిరీగలపై మక్కువ

చండీఘడ్‌కు చెందిన ఐదేళ్ళ రవిసింగ్‌కు ఆ ఈడు చిన్నారులు ఇష్టపడి తినే చాక్లెట్లు, కేకులు అంటే ఇష్టంలేదు. కందిరీగలంటే పరిగెడతాడు. వాటిని అలాగే తినేస్తాడు. వాటి రుచి అంటే అతడికి మహా ఇష్టం. కందిరీగలే కాదు, మరికొన్ని కీటకాలన్నా అతడికి అమిత ఇష్టమే. ''ఇవి చాలా తియ్యగా ఉంటాయి,'' అంటాడు ఎంతో సంతోషంగా.

ఫతేహాబాద్ జిల్లా నంగాల్ గ్రామానికి చెందిన రవి కందిరీగలు పట్టి తినే వింత దృశ్యాన్ని చూడ్డానికి జనం తండోప తండాలుగా వస్తున్నారు.




తండ్రి, ''ఇదంతా రెండేళ్ళ క్రితమే ఉన్నట్టుండి ఆరంభమయింది. కీటకాలపట్ల అతడికున్న రుచిని చూశాక నేను అతణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి ఎందరో డాక్టర్లను సంప్రదించాను. ఇంకా సంప్రదిస్తూనే ఉన్నాను. అయినా, ఆ అలవాటును మాన్పించలేక పోతున్నాను. తన ప్రవర్తన అతడి కేమాత్రం వింతగా తోచడం లేదు. అతడికి అంతగా స్నేహితులు లేరన్నదే ముఖ్యమైన కొరత,'' అంటున్నాడు అతడి తండ్రి కాలాసింగ్.



# అర్థం - అపార్థం

గంగా నదీ తీరం లక్షపురంలోని ప్రముఖ వ్యాపారి దయానిధి మనవడు గోపాలుడు పదహారేళ్ళకే సకల శాస్త్రాలూ చదివాడు. గోపాలుడి ఇంట్లో నిత్యశాంతి. అయితే అతడి మిత్రుల ఇళ్ళల్లో నిత్యం అశాంతి. ''ఇళ్ళల్లో గొడవలకు కారణం స్వార్థం. ఆ స్వార్థం ఆడవాళ్ళల్లో మరీ ఎక్కువ. మీ తాతయ్యలా ఆడవాళ్ళను అదుపు చేసే సత్తా ఉన్న మగాళ్ళు మా ఇళ్ళల్లో లేరు,'' అని తరచూ వాపోయే వాళ్ళు అతడి మిత్రులు.

ఆ మాటలు నిజమనిపించిన గోపాలుడు పెళ్ళికి విముఖంగా ఉంటూ తల్లిదండ్రులు ఏ పిల్లను చూపించినా కాదనేవాడు.

దయానిధి కీవిషయం తెలిసి మనవణ్ణి పిలిచి, ''మహాత్ములను తప్పిస్తే ప్రపంచంలో ప్రతి మనిషికీ స్వార్థం ఉంటుంది. స్వార్థానికి ఆడా, మగా తేడా ఉండదు. కాని తన కోసం ఆలోచించే మగవాడి స్వార్థం కంటే తన వాళ్ళ కోసం ఆలోచించే ఆడదాని స్వార్థం గొప్పది. అందుకే ఆ స్వార్థాన్ని త్యాగం, ప్రేమ అని కూడా అంటారు,'' అంటూ హితబోధ చేశాడు.

గోపాలుడు వెంటనే తాత ఏ పిల్లను చూపిస్తే ఆ పిల్లను పెళ్ళి చేసుకునేందుకు సిద్ధమన్నాడు. కానీ దయానిధి అందుకు ఒప్పుకోకుండా, ''మిత్రులు చెబితే పెళ్ళి వద్దన్నావు. నేను చెబితే పెళ్ళికి సిద్ధమన్నావు. సకల శాస్త్రాలూ చదివినా నీకు ఇంకా లోకజ్ఞానం అబ్బలేదు. ఏ విషయం లోనైనా ఎప్పుడు సొంత నిర్ణయం తీసుకుంటావో అప్పుడే నీ బుద్ధి వికసించినట్టు. అంత వరకు దేశాటన చేసిరా,'' అన్నాడు.

దేశాటనకు బయలుదేరిన గోపాలుడు పలు ప్రాంతాలు తిరిగి కొన్నాళ్ళకు గోదావరీ తీరాన ఉన్న మహాపురం చేరుకున్నాడు.

''వసుంధర''



అతడు గోదావరిలో స్నానం చేస్తూండగా ఒక అందమైన యువతి బిందెతో నీళ్ళకు అక్కడికి వచ్చింది. ఆమె అందానికి ముగ్ధుడైన గోపాలుడు ఆమెకు తన వివరాలు చెప్పి, ''నువ్వు నాకు నచ్చావు. నీకూ నేను నచ్చితే మీ పెద్దలతో మాట్లాడి నిన్ను పెళ్ళి చేసుకుంటాను,'' అన్నాడు.

ఒక అపరిచితుడు తనతో పెళ్ళి ప్రస్తావన తేవడంతో ఆ యువతి సిగ్గుపడి తొట్రుపాటుతో త్వరత్వరగా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఇదంతా పక్కనే ఉండి గమనిస్తూన్న బసవయ్య అనే యువకుడు, గోపాలుణ్ణి సమీపించి, ''ఆమె నా చిన్నాన్న కూతురు చంద్రలేఖ. వాళ్ళది రైతుకుటుంబం. లేనివాళ్ళే గాని నీకు పిల్లనివ్వరు. నమ్మకం లేకపోతే రా. వాళ్ళచేతే ఆ మాట చెప్పిస్తాను,'' అంటూ అతణ్ణి చంద్రలేఖ తండ్రి గురవయ్య ఇంటికి తీసుకువెళ్ళాడు. అక్కడ బసవయ్య గురవయ్యకు గోపాలుణ్ణి చూపి, ''ఇతడి పేరు గోపాలుడు. ఊరు గంగాతీరంలోని లక్ష్మిపురం. అక్కడెవరూ పిల్లనివ్వక ఇంత దూరం వచ్చాడు. నదీ తీరాన మన చంద్రలేఖను చూసి ఇష్టపడ్డాడు. పెళ్ళి చేసుకుంటానంటే వెంటబెట్టుకువచ్చాను,'' అన్నాడు.

గురవయ్య గోపాలుడి మీద మండిపడ్డాడు. బసవయ్య చెప్పిన మాటలు నిజం కావని రుజువు చేస్తానన్నాడు గోపాలుడు. కాని బసవయ్య, ''నీవాళ్ళ దగ్గరికి వెళ్ళి వాకబు చేయాలంటే పెళ్ళి ఖర్చులకంటే ఎక్కువవుతుంది మా చిన్నాన్నకు,'' అని నిరసించాడు.

ఆ సమయంలో అక్కడికి వచ్చిన శ్రీనాథుడనే ఆ ఊరి ప్రముఖుడు జరిగింది విని గురవయ్యతో, ''తుంటరి అని తెలిసీ బసవయ్య మాటలు నమ్మి కూతురికి వచ్చిన బంగారం లాంటి సంబంధాన్ని వదులుకుంటావా?'' అన్నాడు.

''బసవయ్య ఎంతయినా నా అన్న కొడుకు. గోపాలుడు ముక్కూ మొహం తెలియనివాడు. ఇతడికిచ్చి నా కూతురు గొంతు కోయమంటావా?'' అన్నాడు గురవయ్య బాధగా.

''అలా ఎందుకంటాను? చంద్రలేఖ నీకు కూతురైతే, నాకూ కూతురు లాంటిది. నేను గోపాలుడి మాటలు నమ్ముతున్నాను. చంద్రలేఖ ఇష్టపడితే వీళ్ళ పెళ్ళికి ఒప్పుకో. ఈలోగా లక్ష్మిపురానికి కబురంపిస్తాను. అక్కడి నుంచి పెద్దలు వస్తే నిజానిజాలు తెలుసు

కుని నిర్ణయం తీసుకోవచ్చు. ఈ పెళ్ళివల్ల చంద్రలేఖ సుఖపడుతుందనే నేనింతగా చెబుతున్నాను. కాదనకు,'' అన్నాడు శ్రీనాధుడు.

ఆయన మాట మీదున్న గురితో గురవయ్య సరేనన్నాడు.

తరవాత అంతా శ్రీనాధుడు చెప్పినట్టే జరిగింది. పెళ్ళయ్యాక లక్షపురానికి తిరిగి వెళుతూ గోపాలుడాయనతో, 'నేను ఇష్టపడ్డ అమ్మాయితో నా పెళ్ళి జరిగింది. అందుకు నువ్వే కారణం. నీ ఉపకారం నేను, నా భార్య జీవితాంతం గుర్తుంచుకుంటాం,'' అన్నాడు కృతజ్ఞతతో.

''గుర్తుంచుకుంటే సరిపోదు. శుభకార్యాలకు సకుటుంబంగా మా ఇంటికి వచ్చి వెళుతూండాలి,'' అన్నాడు శ్రీనాధుడు.

లక్షపురానికీ, మహాపురానికీ దూరం ఎక్కువే అయినా గోపాలుడు మొదట్లో యేడాదికోసారి అత్తవారింటికి వచ్చేవాడు. వచ్చినప్పుడల్లా శ్రీనాధుడి ఇంటికి కూడా వెళ్ళేవాడు. శ్రీనాధుడు కూడా ఒకసారి లక్షపురం వెళ్ళివచ్చాడు.

ఇలా ఉండగా ఒకనాడు శ్రీనాధుడింటికి దుర్జయుడనే దూరపు బంధువు వచ్చి, కష్టాలు చెప్పుకుని ఆశ్రయం కోరాడు. శ్రీనాధుడతనిపై జాలిపడి ఇంట్లో ఉండమన్నాడు. రాత్రి అందరూ నిద్రపోయే సమయంలో అతడు నగలు దొంగిలించుకుని వీధిలోకి గుట్టు చప్పుడు కాకుండా వచ్చాడు. అదే సమయానికి మారువేషంలో నగరసంచారం చేస్తూ అక్కడికి వచ్చిన ఆ దేశపురాజు దుర్జయుణ్ణి



చూసి పట్టుకున్నాడు. ఆ పట్టు నుంచి తప్పించుకోలేక దుర్జయుడు, ''దొంగ, దొంగ,'' అని అరవసాగాడు. దూరాన ఉన్న కాపలా భటులు పరిగెత్తుకు వచ్చారు. మారువేషంలోని రాజు తానెవరైందీ చెప్పకుండా దుర్జయుడే దొంగ అన్నాడు. అయితే, దుర్జయుడు తాను శ్రీనాధుడి బంధువుననీ, తనను పట్టుకున్న రాజే దొంగ అనీ బుకాయించాడు. నిజానిజాలు తెలుసుకునేందుకు భటులు వాళ్ళిద్దరినీ శ్రీనాధుడి ఇంట్లోకి తీసుకు వెళ్ళారు.

అసలు విషయం గ్రహించిన శ్రీనాధుడు మంచి మాటలు చెప్పి కాపలాభటులను పంపేశాడు. తరువాత రాజుకు చేతులు జోడించి, ''నువ్వెవరో నాకు తెలియదు. నా నగలు పోకుండా కాపాడినందుకు కోరినది ఇస్తాను.



లక్షపురంలో గోపాలుడు పెద్ద ఇల్లు కట్టాడు. గృహప్రవేశం కూడా ఆ ఇంటికి తగ్గట్టు ఉండాలని పెద్ద ఎత్తున ఏర్పాట్లు మొదలుపెట్టి, శ్రీనాథుడికి ఆహ్వానం పంపాడు.

ఆ సమయానికి వృద్ధురాలైన శ్రీనాథుడి తల్లికి పెద్ద జబ్బు చేసి కోలుకుంటున్నది. సంగతి తెలిసి ఆమె కొడుకుతో, ''కొన్నాళ్ళు నన్ను విడిచి ఎక్కడికీ వెళ్ళొద్దు. నాకేమో భయంగా ఉన్నది,'' అని చెప్పింది. అందుకు శ్రీనాథుడు, ''గోపాలుడు అంత అభిమానంగా పిలిచాడు. వారంలో నీ దగ్గరుంటాను కదా?'' అని తల్లికి నచ్చజెప్పి ప్రయాణమయ్యాడు.

అతడు లక్షపురం చేరేసరికి అక్కడి పరిస్థితి వేరుగా ఉన్నది. చంద్రలేఖ తండ్రి గురవయ్య ఇంట్లో జారి పడి కాలువిరిగి మంచం పట్టాడు. అతడు లేచి తిరగడానికి నెల రోజులు పడు తుందన్నారు వైద్యులు. తండ్రి మంచం మీదుండగా వేడుక చేసుకోనన్నది చంద్రలేఖ.

శ్రీనాథుణ్ణి ఆత్మీయంగా ఆదరించిన గోపాలుడు, చంద్రలేఖ విషయం చెప్పి అయన్ను కొత్త ముహూర్తం దాకా ఉండి పొమ్మన్నారు. శ్రీనాథుడు తల్లి అనారోగ్యం గురించి చెప్పి అన్నాళ్ళుండడం కుదరద న్నాడు. అయితే అప్పుడు పెళ్ళి ముహూర్తం నాటికి మళ్ళీ రమ్మని కోరాడు గోపాలుడు. శ్రీనాథుడు ఆలోచిస్తూంటే చంద్రలేఖ, ''మా అమ్మనకు ఎవరైనా నీ తరవాతే. దానం ... మాత్రం పిలుతేను,'' అన్నది.

శ్రీనాథుడు మహోత్సాహంగా ... న్నాడు. ఏవో ముఖ్యమైన పనులు పడి ఆయన మళ్ళీ

నా బంధువు దొంగ అన్న విషయం నలుగురిలో చెప్పకు,'' అన్నాడు.

శ్రీనాథుడి మంచితనానికి ఆశ్చర్యపోయిన రాజు అప్పటికి సరేనని వెళ్ళిపోయాడు. తరవాత ఆయన వాకబు చేసి శ్రీనాథుడి పరోపకారగుణం గురించి తెలుసుకుని, ''ఇటువంటి వ్యక్తికి రాజసన్మానం చేస్తే పౌరులందరికీ ఆదర్శంగా ఉంటుంది,'' అని భావించి ఆ ఊళ్ళోనే సన్మానం తలపెట్టాడు.

శ్రీనాథుడు తనకు జరిగే రాజసన్మానం గురించి గోపాలుడికి కబురు చేసి తప్పక రావలసిందిగా కోరాడు. అయితే, పనుల ఒత్తిడివల్ల రాలేనని కబురుపెట్టాడు గోపా లుడు. శ్రీనాథుడు దాన్ని అంతగా పట్టించు కోకుండా స్నేహ భావాన్ని కొనసాగించాడు. రెండేళ్ళు గడిచిపోయాయి.

లక్షపురం వెళ్ళలేదు. అంతచెప్పినా గృహప్రవే శానికి రానందుకు నొచ్చుకున్న చంద్రలేఖ, శ్రీనాధుణ్ణి గురించి నలుగురి వద్దా అనరాని మాటలన్నది. గోపాలుడు కూడా ఆమెను సమర్థించాడు. విషయం తెలిసినా శ్రీనాధుడు మాత్రం వాళ్ళను గురించి ఎవరి వద్దా పల్లెత్తు మాట అనలేదు.

యేడాది గడిచాక గోపాలుడు అందరితో మహాపురం వచ్చి శ్రీనాధుణ్ణి చూడబోయాడు. ఆయన ముభావంగా, ''నాకు రాజసన్మానం జరిగితే రానివాడివి ఇప్పుడెందుకు చూడ వచ్చావు, నాతో మాట్లాడకు వెళ్ళు,'' అన్నాడు.

''ఎప్పుడో జరిగినదానికి ఇప్పుడా కోపం!'' అనుకుంటూ గోపాలుడు దిగులుగా ఇంటికి తిరిగివెళ్ళి, తాత దయానిధితో జరిగినది చెప్పాడు. ఆయన నవ్వి, ''ఇందులో ఆశ్చర్యం ఏముంది? శ్రీనాధుడికి సన్మానం జరిగితే నువ్వు వెళ్ళ లేదు. దాన్నాయన మనసులో పెట్టుకోకుండా నీ ఇంట్లో వేడుక అంటే వచ్చాడు. కాని నువ్వు వాయిదా వేశావు. రెండోసారి రాలేకపోయినందుకు ఆయన్ను నీ భార్య దుర్భాషలాడితే నువ్వు సమర్థించావు. అలాంటప్పుడు ఆయనకు కోపంరావడంలో న్యాయముంది కదా?'' అన్నాడు.

గోపాలుడు తెల్లబోయి, ''నువ్వు చెప్పింది నిజం తాతయ్యా. నువ్వు చెప్పేదాకా నా తప్పు నాకెందుకు స్ఫురించలేదు?'' అన్నాడు బాధగా. ''ఎందుకంటే ఇన్నేళ్ళయినా నీబుద్ధి వికసించలేదు. ఇతరులు చెప్పింది నిజమను కుంటావు. సొంత బుద్ధి లేదు. మొదట ఆయనకెళ్ళి క్షమాపణలు చెప్పు,'' అన్నాడు తాతయ్య.

గోపాలుడు సరేనని శ్రీనాధుణ్ణి కలుసుకుని తన తప్పు మన్నించమని అడిగాడు. శ్రీనాధుడు నవ్వి, ''నాకు నీ మీద కోపం ఎన్నడూ లేదు. ఏ విషయంలోనైనా ఎదుటి వారిని అపార్థం చేసుకోవడం కంటే అర్థం చేసుకోవడం ముఖ్యం,'' అన్నాడు.

ఆ మాటతో తనలోపం గ్రహించిన గోపాలుడు అప్పటి నుంచి భార్యతో సహా ఎవరేది చెప్పినా అందులోని నిజానిజాలను, మంచి చెడ్డలను తరచి చూస్తూ, ఉపయోగకరమైన వాటిని మాత్రం తీసుకుంటూ సుఖంగా జీవించసాగాడు.






## బాడ్మింటన్

సాయినా నేహ్వాల్ (18) పుణేలో జరిగిన యోనెక్స్ సరైస్ వరల్డ్ జూనియర్స్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో సాయకోసాటోతో పోటీ పడి 21-9, 21-18 తేడాతో వరల్డ్ జూనియర్ విమన్స్ సింగిల్స్ టైటిల్ కైవసం చేసుకుని అద్భుతమైన ప్రతిభను కనబరచింది. మన భారతీయ క్రీడాకారిణి ధాటికి జపాన్ యువతి తట్టుకోలేక పోయింది. ''ఆమె నిజమైన ఛాంపియన్‌గా ఆడింది,'' అని నేషనల్ ఛీఫ్ కోచ్ పుల్లెల గోపీచంద్ అభినందించడంతో పాటు, ''మంచి క్రీడాకారిణిగా ఆమె రోజురోజుకూ అభివృద్ధి చెందుతోంది,'' అని కితాబునిచ్చాడు. 2008 ప్రారంభంలో ప్రపంచ స్థాయిలో 30వ ర్యాంకుతో ప్రారంభించిన సాయినా జూన్‌కల్లా 20వ స్థానానికి ఎగబ్రాకింది. 2009లో టాప్‌ఫైవ్‌కి చేరుకోగలనన్న నమ్మకంతో ఉంది సాయినా.

## షూటింగ్




బ్యాంకాక్ వరల్డ్ కప్‌లో 600/600 సాధించడంతో గగన్ నరంగ్ వరల్డ్ కప్‌ను సాధించడంతో పాటు ప్రపంచ రికార్డును కూడా సృష్టించాడు. 2000వ సం. నుంచి థాయ్‌లాండుకు చెందిన మచ్చదీప్ టవారిట్ కైవసంలో ఉన్న ప్రపంచ రికార్డుకు సమంగా వచ్చాడు. ఈ రికార్డు అందుకున్న మూడవ క్రీడాకారుడు నరంగ్. బీజింగ్ ఒలింపిక్స్‌లో 10మీ. ఎయిర్ రైఫిల్‌తో బంగారు పతకం సాధించలేకపోయిన నరంగ్ 600/600 స్కోర్ చేసి క్వాలిఫైయింగ్ రౌండ్ 600/600, ఫైనల్ రౌండ్‌లో 103.5 పాయింట్లు సాధించి ప్రపంచ రికార్డు సృష్టించాడు. 2006లో స్పెయిన్ గ్రనాడా వరల్డ్ ఛాంపియన్‌షిప్‌లో ఆస్ట్రియన్ ఫార్నిక్ థామస్ నెలకొల్పిన రికార్డును నరంగ్ అధిగమించాడు. నరంగ్ తన విజయాన్ని నేషనల్ కోచ్ ప్రొఫెసర్ సన్నీ థామస్‌కు అంకితమిచ్చాడు.

మన వారసత్వ ప్రదేశాలు

# నందాదేవి పూలలోయ



ప్రకృతి ప్రేమ, పర్వతారోహణ పట్ల ఆసక్తి కలిగిన వారయితే మీరు తప్పకుండా నందాదేవిని, పూలలోయను సందర్శించాలి. నందాదేవి నేషనల్ పార్క్ ఉత్తరాంచల్ చమోలీ జిల్లా హిమాలయ సానువులలో ఉన్నది. ఇక్కడి డబ్ల్యు డబ్ల్యు గార్డెన్ ప్రాంతం 1883లోనే కనుగొనబడింది. 1936వ సం.లో టిల్మాన్, ఎన్. ఇ. ఓడెల్ ఇక్కడికి వెళ్ళిరావడంతో ఈ ప్రాంతంపైన పెద్ద ఎత్తున ఆసక్తి పెరిగింది.

1939లో గేమ్ శాంక్చువరీగానూ 1982లో నేషనల్ పార్క్ జాతీయోద్యానంగా నామకరణం చేయబడింది. 1988లో యునెస్కో దీనిని ప్రపంచ వారసత్వ ప్రదేశంగా ప్రకటించింది.

పశ్చిమ హిమాలయాలలోని వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్ నేషనల్ పార్క్ అనే పూలలోయ మైమరపించే ప్రకృతి సౌందర్యానికి పేరుగాంచింది. ఎక్కడ చూసినా విచ్చుకున్న ఆల్ఫైన్ పువ్వులతో కనులవిందు చేస్తాయి. వైవిధ్యానికి పేరుగాంచిన ఈ ప్రాంతం మంచు చిరుత, కస్తూరి జింక, భరాల్ వంటి పలు అరుదైన, అంతరించి పోతూన్న క్షీరదాలకు నిలయంగా ఉంటోంది. వృక్ష శాస్త్రవేత్తా, పర్వతారోహకుడూ అయిన ఫ్రాంక్ ఎస్. స్మిత్, మౌంట్ కామెట్‌కు వెళుతూ వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్‌ను కనుగొన్నాడు. ఇది నందాదేవికి వాయవ్యదిశగా 20 కి.మీ. దూరంలో ఉన్నది. దీని అందచందాలను చూసి ఆశ్చర్యపడే పర్యాటకులు దీనిని 'దేవతల నివాసం'గా వర్ణిస్తారు. ఈలోయ వర్షాకాలంలో అసంఖ్యాకమైన రకరకాల పువ్వులతో మరింత శోభాయమానంగా కనిపిస్తుంది. 2005వ సం.లో దీనిని ప్రపంచ వారసత్వ ప్రదేశాల జాబితాలోకి తీసుకున్నారు.

లక్ష్మణుడి ప్రాణాలు కాపాడడానికి హనుమంతుడు ఇక్కడి నుంచే సంజీవనీ మూలికను తీసుకువెళ్ళాడని చెబుతారు.

ఇక్కడ దేవదారు, భూర్జం, రోడోడెండ్రాన్, జూనిపర్ చెట్లు విరివిగా కనిపిస్తాయి. నందాదేవిలో 312 పుష్పజాతులు ఉన్నాయి. వాటిలో 17 చాలా ప్రత్యేకమైనవని చెబుతారు. అంతరించి పోతూన్న అరుదైన 14 జాతుల క్షీరదాలు ఈ ఉద్యానంలో ఉన్నాయి.

ఎత్తయిన ప్రదేశం గనక, సంవత్సరం పొడవునా ఇక్కడ చలిగా ఉంటుంది. ఆరు నెలల పాటు ఈ ప్రాంతం మంచుతో కప్పబడి ఉంటుంది. జూన్-ఆగస్ట్ మధ్య వర్షాకాలం గనక ఏప్రిల్-అక్టోబర్ నెలల మధ్య వెళ్ళిరావడానికి అనుకూలంగా ఉంటుంది. సమీపంలో ఉన్న జోషీమఠ్‌లో బస, భోజన సదుపాయాలు లభిస్తాయి.



# దురాచారం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు బ్రహ్మదత్తుడి కుమారుడుగా జన్మించాడు. అతనికి బ్రహ్మదత్త కుమారుడని నామకరణం చేశారు. అతను తక్షశిలకు వెళ్ళి పదహారేళ్ళు నిండే లోపునే వేదాలూ, వేదాంగాలూ, ఉపనిషత్తులూ చదివాడు. అతను విద్య పూర్తిచేసుకుని తిరిగి రాగానే తండ్రి అతనికి యౌవరాజ్యాభిషేకం చేశాడు.

ఆ కాలంలో కాశీరాజ్యంలో ప్రజలు అనేక దేవతలను పూజించేవారు. అనేక జాతరలు చేసేవారు. జాతరలు జరిగినప్పుడల్లా గొర్రెలనూ, మేకలనూ, కోళ్ళనూ దేవతలకు బలి ఇచ్చి, వాటి రక్తం నైవేద్యం పెట్టేవారు. బ్రహ్మదత్త కుమారుడు ప్రజల మూఢ విశ్వాసాలనూ, దురాచారాలనూ చూసి చాలా బాధపడే వాడు. ''నేను రాజునయ్యాక ఈ దురాచారాల నన్నిటినీ అరికడతాను. నేల మీద ఒక్క చుక్క రక్తం రాల్చకుండా చేస్తాను,'' అని అనుకునేవాడు.

కాశీనగరం వెలుపల ఒక మర్రిచెట్టుండేది. ఆ చెట్టులో ఒక దేవత ఉన్నదనీ, మొక్కుకున్నవాళ్ళకు ఆ దేవత పిల్లల నిస్తుందనీ, ఇతర కోరికలేవైనా ఉంటే ఈడేర్చుతుందనీ ప్రజలు నమ్మేవాళ్ళు.

ఒకనాడు బ్రహ్మదత్త కుమారుడు రథమెక్కి ఊరి వెలుపల ఉన్న మర్రిచెట్టు వద్దకు వెళ్ళాడు. ఆ చెట్టు చుట్టూరా అనేకమంది స్త్రీలూ, పురుషులూ భక్తితో ప్రదక్షిణలు చేస్తున్నారు. చెట్టుకు అంత దూరంలోనే యువరాజు రథం దిగి, చెట్టును పూలతో పూజించి, చెట్టు చుట్టూ మూడు ప్రదక్షిణలు చేశాడు. ఆ తరవాత అతను తన రథమెక్కి నగరంలోకి తిరిగి వెళ్ళిపోయాడు. అది

జాతక కథ

మొదలు అతను తరుచూ ఆ మఱ్ఱిచెట్టు వద్దకు వెళ్ళి, చెట్టు చేమలపై, క్షుద్రదేవతలపై విశ్వాసం ఉండే మామూలు మనుషుల లాగే చెట్టును పూజిస్తూ, దాని చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ రాసాగాడు.

కొంతకాలం ఇలా గడిచాక ముసలి రాజు చనిపోయాడు. బ్రహ్మదత్త కుమారుడు కాశీ రాజ్యానికి రాజయ్యాడు.

రాజ్యాభిషేకం అయిన వెంటనే అతను నిండు పేరోలగం ఏర్పాటు చేసి అందులో ఈ విధంగా మాట్లాడాడు:

‘‘నేను రాజు నెలా అయ్యానో మీరెవరూ ఎరగరు. కాని, యువరాజుగా ఉన్న కాలంలో నేను ఊరి బయట ఉండే మఱ్ఱి చెట్టును భక్తిశ్రద్ధలతో పూజించి వస్తూ ఉండిన సంగతి మీరెరిగే ఉంటారు. నన్ను రాజును చేసి నట్టయితే ఆ మఱ్ఱిచెట్టుకు వెయ్యి జీవాలను బలి ఇస్తానని మొక్కుకున్నాను. ఈనాటికి నా కోరిక ఈడేరింది. అన్న మాట ప్రకారం మొక్కు చెల్లించాలి. మఱ్ఱిచెట్టుకు తప్ప కుండా బలి జరగాలి!’’

ఈ సంగతి వినగానే సభికులంతా పరమా నంద భరితులయ్యారు. మంత్రులు, ‘‘మహా రాజా, తాము మఱ్ఱిచెట్టుకు ఏ జంతువులను బలి ఇస్తామనుకున్నారో సెలవిప్పించండి. వెంటనే అన్ని ఏర్పాట్లూ చేయిస్తాం,’’ అన్నారు.

‘‘నేను బలి ఇస్తానని మొక్కుకున్నది జంతువులను కాదు-దేవతలకు జంతువు లను బలి ఇచ్చే మనుషులను. అటువంటి వారిని వెయ్యిమందిని తీసుకురండి. నా మొక్కు చెల్లించుకుంటాను. ఈరోజు లగా యతు ఎవరెవరైతే దేవతలకు బలులిస్తారో, వారు మఱ్ఱిచెట్టుకు బలి చేయబడతారని దేశమంతటా చాటింపు చేయించండి!,’’ అన్నాడు రాజు.

సభికులు నిర్విణ్ణులైపోయారు. కాని వారు బలులలో నమ్మకం ఉన్నవారే గనక, ఏమీ అనలేకపోయారు. దేశమంతటా చాటింపు జరిగింది.

అది మొదలు ఇంద్రజాలం లాగా కాశీ రాజ్యంలో జంతుబలులు మటు మాయ మయ్యాయి.



Non-stop fun @ chandamama.com!



# Non-stop fun @ chandamama.com!



## Play our Cricket Quiz!

Know about your favourite players by answering simple questions. SMS CMCQ to 54646 and win fabulous prizes.



## Dear Chandamama

School issues? Friendship woes? Just plain confused about life and its problems?

Come to us with your questions and we will try to help you see light!

Pankaj. Z from California: Is komodo dragon a real dragon?

Karan J from Powai: I want to become a cartoonist. Please tell me how!

Nihan Varma from Nainital: I always yawn when I'm in a crowded place! Why is that?

To know the answers, browse CONNECT under CONTEMPORARY section at www.chandamama.com





## What's more...

Browse www.chandamama.com for hundreds of stories and comics for your reading pleasure...

Download cool games and applications at the Download center.

Want to become a Chandamama Author? Come online and submit your stories!



# రామాయణం

ఈ విధంగా రావణుడి సభలో అనేకమంది రాక్షస ప్రముఖులు, ''ఇప్పుడే వెళ్ళి రామ లక్ష్మణులనూ, వానరసేననూ నాశనం చేస్తాం,'' అంటూ లేవటం చూసి, విభీషణుడు వారిని వారించి కూర్చోమని, చేతులు మోడ్చి రావణుడితో ఇలా అన్నాడు:

''సామ దాన భేదోపాయాల వల్ల సాధ్యం కాని దాన్నే దండోపాయం ద్వారా సాధించాలని బుద్ధిమంతులంటారు. ప్రమత్తులూ, దురాశాపరులూ, దైవోపహతులూ అయిన వారి పట్ల ప్రయోగిస్తే దండోపాయం ఫలిస్తుంది, లేకపోతే ఫలించదు. రాముడు అప్రమత్తుడు, బలవంతుడు. హనుమంతుడు సముద్రం దాటి, లంకకు వచ్చి చేసిన అద్భుత కార్యాలు చూస్తే దైవం రాముడికి అనుకూలంగా ఉన్నట్టు కూడా కనబడుతుంది. శత్రు బలాన్ని తక్కువ చేసి చూడవద్దు. రాముడు రాక్షసులకు చేసిన అపకారానికి ప్రతీకారంగా నువ్వు సీతను ఎత్తుకు వచ్చావందామనుకున్నా, రాముడు తానై ఖరుడు మొదలైన రాక్షసులను చంపలేదు. వాళ్ళే పనిపెట్టుకుని అతని పైకి వెళ్ళారు. రాముడు ఆత్మరక్షణ కోసం వారిని చంపవలసి వచ్చింది. సీతను తీసుకు రావటం మనకే చేటు. ఆమెను తిరిగి రాముడి కివ్వటం మంచిది. నీ మేలు కోరి ఈ మాట చెబుతున్నాను. రాముడి బాణాలు లంకను సర్వనాశనం చెయ్యక ముందే సీతను రాముడికిచ్చెయ్యి.''

విభీషణుడీ మాటలనగానే రావణుడు సభ చాలించి తన ఇంటికి వెళ్ళిపోయాడు. విభీ

యుద్ధకాండ – 2



షణుడు మర్నాడు ఉదయం రావణుడి భవనానికి వెళ్ళి, మంత్రులు తప్ప మరెవరూ లేని సమయంలో తన అన్నతో, ''సీత వచ్చినది మొదలు అనేక దుశ్శకునాలు కనిపిస్తున్నాయి. ఈ సంగతి లంకలోని ప్రతి ఒక్కరికీ కూడా తెలుసు. మంత్రులు నీతో ఈ సంగతి చెప్పరు. అన్ని విషయాలూ చక్కగా ఆలోచించి న్యాయప్రకారం చెయ్యి,'' అన్నాడు.

రావణుడీ మాట విని కోపంచెంది, ''నాకెవరి భయమూ లేదు. రాముడు సీతను పొందలేడు. దేవేంద్రుడు సహాయం వచ్చినా యుద్ధంలో నా ఎదుట నిలవలేడు,'' అని చెప్పి విభీషణుణ్ణి పంపేశాడు.

తరవాత రావణుడు యుద్ధం గురించి తన మంత్రులతో ఆలోచించగోరి, తన రథాన్నెక్కి, సపరివారంగా సభాభవనానికి వెళ్ళి, రాక్షసులనందరినీ పిలుచుకు రమ్మని దూతలను పంపాడు. దూతలు రాక్షసులందరి ఇళ్ళకూ వెళ్ళి వేరువేరు పనులలో నిమగ్నులై ఉన్న రాక్షసులను పిలిచారు. వారందరూ వచ్చిన మీదట, రావణుడు విభీషణుణ్ణీ, శుకుణ్ణీ, ప్రహస్తుణ్ణీ ప్రత్యేక స్థానాలలో కూర్చోమని చెప్పి, ప్రహస్తుడితో, ''మన రాక్షస సైనికులు లంకానగరాన్ని ఎప్పటికన్న జాగ్రత్తగా రక్షించాలని చెప్పు,'' అన్నాడు.

ప్రహస్తుడు బయటికి వెళ్ళి తిరిగి వచ్చి, ''సమస్త సైన్యమూ సంసిద్ధంగా ఉన్నది,'' అని చెప్పాడు.

''మీ సలహాతో ప్రారంభించిన ప్రతి పని సఫలమయింది. ఇప్పుడు కూడా మీ సహాయంతో నాకు జయం లభించి తీరుతుంది. ఇప్పుడున్న సమస్య ఏమిటో మీకు ముందే చెప్పాను. ఆరు మాసాలుగా నిద్రపోతూ ఉండటం చేత ఒక్క కుంభకర్ణుడికే చెప్పలేదు. అతడిప్పుడిక్కడ ఉన్నాడు. జనకుడి కుమార్తె, రాముడి భార్యా అయిన సీతను రాక్షసులుండే దండకారణ్యం నుంచి తెచ్చాను. ఎంత చెప్పినప్పటికీ ఆమె నన్ను ప్రేమించటం లేదు. అలాటి సుందరి మూడు లోకాలలోనూ లేదు. ఆమె మూలాన నేను మోహావేశంతో దహించుకు పోతున్నాను. రాముడు వచ్చి తనను రక్షిస్తాడేమోనన్న నమ్మకంతో సీత నన్ను ఒక సంవత్సరం గడువడిగింది. నేను సరే నన్నాను. రాముడు వానర సేనతో సముద్రం దాటి రావటం అసాధ్యం. కాని దాటి రాగలిగితే మనమేం చెయ్యాలి? ఎందు

కంటే ఒక్క వానరుడు సముద్రం దాటి వచ్చి పెద్ద యుద్ధం చేసి పోయాడు. అందుచేత బాగా ఆలోచించండి. రాముడు వానర సేనతో సముద్రం అవతలి ఒడ్డున చేరి ఉన్నాడు. సీతను ఇచ్చేమాట అబద్ధం. రామలక్ష్మణులను చంపే ఉపాయం చూడండి,'' అని రావణుడన్నాడు.

రావణుడన్న మాటలు విని కుంభకర్ణుడు మండిపడుతూ, ''సీతను తీసుకురాకపూర్వం మాతో ఈ ఆలోచన చేసి ఉండవలిసింది. ఏ పని చేసేటప్పుడైనా ముందుగానే చక్కగా ఆలోచిస్తే తరవాత పశ్చాత్తాపపడ నవసరముండదు. కొంచెంకూడా ఆలోచించకుండా సీతను అపహరించి తెచ్చావు. రాముడు నిన్నిదివరకే చంపక పోవటం అదృష్టం. ఈ స్థితిలో నీ శత్రువుల నందరినీ చంపి నీ కార్యం నెరవేర్చే శక్తిగలవాణ్ణి నేనొక్కణ్ణే ఉన్నాను. నేనా పని చేస్తాను. అందుచేత నువ్వు నిశ్చింతగా ఉండు,'' అన్నాడు.

కుంభకర్ణుడి మాటలు రావణుడికి కోపం కలిగించాయి. ఆ సంగతి గ్రహించి మహాపార్శ్వుడనే రాక్షసుడు, ''తేనె కోసం భయంకర మృగాలున్న వనంలో ప్రవేశించి తేనె సంపాదించుకున్న వాడు, దాన్ని తాగకపోతే వాడు వట్టి మూఢుడు. రావణా, అందరికీ నువ్వే ఈశ్వరుడవు, నిన్నడ్డగల వారెవరు? సీతను యథేచ్ఛగా అనుభవించు. ఆమె ఒప్పకపోతే బలాత్కారంగానైనా అనుభవించు. నీ కోరిక తీరినాక ఏం వచ్చినా రానీ. నువ్వు అన్నిటినీ ఎదుర్కోగలవు. దేవేంద్రుణ్ణి సయితం



జయించగల వారు కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ ఉండనే ఉన్నారు. సామ దాన భేదాలన్నవి చేతగాని వారికి. నువ్వు దండోపాయంతోనే కార్యసిద్ధి పొందు,'' అన్నాడు.

ఈ మాట రావణుడికి నచ్చింది. అతడు మహాపార్శ్వుడితో, ''నన్ను గురించి ఒక రహస్యమున్నది. ఒకప్పుడు పుంజికస్థల అనే అప్సరస బ్రహ్మదేవుడి ఇంటికి పోతూ ఉంటే చూసి బలాత్కారంగా చెరిచాను. ఆ సంగతి బ్రహ్మకు తెలిసిందట. ఆయన, అది మొదలు నేను ఏ పరస్త్రీని గాని బలాత్కారంగా అనుభవిస్తే నా తల నూరు ముక్కలవుతుందని శపించాడు. ఆ శాపానికి భయపడే నేను సీతను బలాత్కారంగా అనుభవించ లేదు. నాకు గల వేగమూ, గమనశక్తీ తెలియక రాముడు నా పైకి వస్తున్నాడు. గుహలో నిద్ర



పోయే సింహాన్ని లేపినట్టుగా మృత్యువులాటి నన్ను కవ్విస్తున్నాడు. నా బాణాల దెబ్బ ఎరగడు. ఇక తెలియజేస్తాను,'' అన్నాడు.

ఈ ధోరణిని విభీషణుడు సహించలేక తనకు తోచిన మాటలు నాలుగూ దులిపేశాడు. సీతను తీసుకురావటం అయిదు తలల విష సర్పాన్ని తెచ్చుకోవటమేనన్నాడు; రాముణ్ణి ఇంద్రజిత్తయేది, రావణుడయేది, ఎవరయేది జయించటం కల్ల అన్నాడు; రావణుడు తప్పు తోవను పోతుంటే మిగిలినవారు అతణ్ణి సరి అయిన మార్గానికి తిప్పటానికి బదులు ఇచ్చకాలాడుతున్నారన్నాడు; సీతను రాముడి వద్దకు పంపెయ్యటం అందరికీ క్షేమమని తేల్చాడు.

విభీషణుడు చెప్పిన ఈ మాటలకు ఇంద్రజిత్తు, ''బాబాయీ, పులస్త్య వంశంలో పుట్టిన నువ్వు అనరాని మాటలన్నావు. బల శౌర్య పరాక్రమాలు లేని పిరికిపందవు! ఎందుకు అందరినీ భయపెట్టుతున్నావు? రామ లక్ష్మణులను చంపటానికి ఒక్క రాక్షసుడు చాలు. నేను ఇంద్రుణ్ణి ఓడించాను. నన్ను చూసి దేవతలు గొర్రెల మందలాగా పారిపోయారు. ఐరావతాన్ని కూల్చి, దాని దంతాలు పెరికాను. అల్పులైన ఈ రాజకుమారులను జయించలేనా?'' అన్నాడు.

''నాయనా, కుర్రవాడివి. నీ బుద్ధి పరిపక్వం కాలేదు. నీ తండ్రి పక్షంగా మాట్లాడుతూ అతనికే శత్రుడివవుతున్నావు. ఈ సభలో నిన్ను మాట్లాడనివ్వటమే తప్పు. సీతను కానుకలతో సహా రాముడికి అర్పించినట్టయితే మనమంతా సుఖంగా ఉండవచ్చు,'' అన్నాడు విభీషణుడు.

ఈ మాట అన్నందుకు రావణుడు విభీషణుడిపై విరుచుకుపడ్డాడు. ''జ్ఞాతివి, శత్రు పక్షపాతివి. జ్ఞాతి కన్న పగవాడు లేడు. తమ్ముడివని క్షమించాను. మరొకడైతే చీల్చేసి ఉందును. ఛీ, వంశం చెడబుట్టిన వాడా!'' అన్నాడు.

రావణుడిలా చీదరించుకోగానే విభీషణుడు మరి నలుగురు రాక్షస అనుచరులతో సహా ఆకాశంలోకి లేచి, ''అన్న వని నీ మేలు కోరి చెప్పాను. నా మీద లేని తప్పు మోపి, నిందించావు. అది సహించరానిది. ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు, కటువుగా ఉన్నప్పటికీ మేలు చేసే మాటలు చెప్పేవారు దొరకరు. నువ్వు రాముడి చేతిలో చావగా చూడలేను. నీ మంచి కోరి చెప్పిన మాటలను క్షమించు. నువ్వూ, లంకా, ఈ రాక్షసులూ

క్షేమంగా ఉండేటట్టు చూసుకో. నేను పోతు న్నాను. నువ్వు సుఖంగా ఉండు,'' అని చెప్పి, అక్కడి నుంచి బయలుదేరి రామలక్ష్మ ణులూ, వానరసేనా వున్న చోటికి క్షణంలో సమీపించాడు.

ఆయుధాలు ధరించి ఆకాశమార్గాన అతి వేగంగా వస్తున్న విభీషణుణ్ణీ, అతని వెంట ఉన్న నలుగురు రాక్షసులనూ వానరులంతా చూశారు. సుగ్రీవుడు ఆ రాక్షసులను చూసి, హనుమంతుడు మొదలైన వారితో, ''ఈ రాక్షసులు తప్పకుండా మనని చంపటానికే ఇటు వస్తున్నారు, చూడండి!'' అన్నాడు.

వెంటనే వానర ప్రముఖులు చెట్లనూ, శిలలనూ తీసుకుని, ''ఈ దుర్మార్గులను చావగొట్టి కిందపడేస్తాం. వీళ్ళెంత?'' అన్నారు.

ఈలోపల విభీషణుడు తన అనుచరులతో సహా సముద్రపు ఉత్తర తీరాన్ని చేరి, ఆకాశం లోనే నిలబడి, సుగ్రీవుణ్ణీ, వానరులనూ చూసి ఇలా అన్నాడు:

''దుర్మార్గుడైన రాక్షస రాజు రావణుడనే వాడికి నేను తమ్ముణ్ణి. నన్ను విభీషణు డంటారు. అతను జటాయువును చంపి, దుఃఖితురాలూ, వివశురాలూ అయి ఉన్న సీతను జనస్థానం నుంచి ఎత్తుకు వచ్చి రాక్షస స్త్రీల రక్షణలో ఉంచాడు. సీతను రాముడికి తిరిగి ఇచ్చి వెయ్యమని నయాన ఎన్నోసార్లు చెప్పాను. కాలం మూడిన రావణుడికి నా మాట రుచించింది కాదు. అందుచేత అతడు నన్ను భృత్యుడిలాగా చూసి పరుష వాక్యాల న్నాడు. నేను భార్యా పుత్రులను సైతం విడిచి



పెట్టి రాముడి శరణు కోరి వచ్చాను. నేనిలా వచ్చానని రాముడికి వెంటనే నివేదించండి.''

ఈ మాటలు వింటూనే సుగ్రీవుడు లక్ష్మణుడి వెంట రాముడున్న చోటికి వెళ్ళి, ''రావణుడి తమ్ముడు విభీషణుడట, నలుగురు రాక్షసులను వెంట బెట్టుకుని నిన్ను శరణు వేడ వచ్చాడు. కొంచెం జాగ్రత్తగా ఉండాలి. ఈ రాక్షసులను నమ్మరాదు; వారు కామ రూపులు, శూరులు, అదృశ్యంగా ఉండగల వారు, మాయావులు. ఇతను రావణుడి వేగులవాడుగా వచ్చి, మన విశ్వాసం సంపాదించి, మన మధ్య భేదాలు కలిగించవచ్చు; సందేహం లేదు. లేదా ఎప్పుడో ఒకప్పుడు ఇతనే మన మీద దెబ్బ తీయవచ్చు. మన శత్రువుకు తమ్ముడైన ఇతని నెలా నమ్మటం? రావణుడే ఇతణ్ణి పంపి ఉండవచ్చు. ఇతణ్ణీ, ఇతడి అనుచరులనూ వెంటనే చంపటం మంచిది,'' అని హెచ్చరించాడు.

రాముడు సుగ్రీవుడి సలహా విన్న మీదట వానర ప్రముఖుల కేసి చూసి, ''సుగ్రీవుడు ఆలోచించి చెప్పిన మాట విన్నారు గదా. అలాగే మీరందరూ కూడా బాగా ఆలోచించి మీకు మీకు తోచిన సలహాలివ్వవచ్చు,'' అన్నాడు.

విభీషణుడు ఎలాటి వాడయినదీ స్పష్టంగా తెల్చుకున్న మీదట అతనిని నమ్మటమో, మానటమో తేల్చుకుందామని అంగదుడన్నాడు. అతణ్ణి పరీక్షించటానికి సూక్ష్మ బుద్ధి గల చారుణ్ణి పంపుదామని శరభుడన్నాడు. విభీషణుడు ఇక్కడికి రావటమే అనుమానాస్పదంగా ఉన్నదని జాంబవంతుడన్నాడు.

హనుమంతుడు అందరి సలహాలనూ కొట్టి పారేశాడు. ''విభీషణుడి మంచి చెడ్డలు విచారించటం ఎలా? సమీపంలో ఉన్న వాడి వద్దకు చారుణ్ణి ఎలా పంపటం? విభీషణుడు ఈ సమయంలో ఇక్కడికి రావటానికి తగిన కారణం ఉన్నది. రావణుడు దుర్మార్గుడని అతనికి తెలుసు. అలాగే రాముడు వాలిని చంపి సుగ్రీవుడికి రాజ్యాభిషేకం చేసిన సంగతి కూడా అతనికి తెలుసు. అతను రాజ్యం కోరి బుద్ధిపూర్వకంగానే తన అన్నను వదిలి ఇక్కడికి వచ్చాడు. ఇలా నాకు తోస్తున్నది. తరవాత నీ ఇష్టం,'' అన్నాడు హనుమంతుడు రాముడితో.





# బాకీ వసూలు

ఒక ఊళ్ళో ధర్మయ్య అనే ధనికుడు ఉండే వాడు. ఆయన ధర్మబుద్ధి కలవాడు; ఊళ్ళో చాలా మందికి ఆయన అవసరానికి స్వల్ప వడ్డీల మీద అప్పులిచ్చి ఆదుకుంటూ ఉండే వాడు. అప్పులు వసూలు చేయడంలో కూడా ఆయన ఎంతో తెలివైన వాడు.

బాకీ వసూలు చేసుకోవడానికి ధర్మ య్యకు అనేక పద్ధతులు ఉండేవి. అభిమాన వంతుడైన సోమశర్మ అనే బ్రాహ్మణుడు ఒక సారి ధర్మయ్య వద్ద యాభై వరహాలు అప్పు తీసుకుంటూ, ''మీరు పత్రమూ, సాక్ష్యమూ లేకుండా నాకు అప్పు ఇస్తున్నారు గదా, నేను ఎగవేస్తే ఏం చేస్తారు?'' అని అడిగాడు.

అందుకు ధర్మయ్య నవ్వి, ''మీవంటి వారికి పత్రమూ, సాక్ష్యమూ ఎందుకండీ? అన్న రోజుకు మీరు తప్పకుండా నా బాకీ చెల్లు వేస్తారని నాకు నమ్మకముంది. ఒకవేళ ఎగవేస్తే, ముష్టివాడికి దానం చేశానను కుంటాను. యాభై వరహాలు పోయినంత మాత్రన నాకు వచ్చే పెద్ద నష్టం ఏదీ లేదు,'' అన్నాడు.

అభిమానం గల సోమశర్మ ధర్మయ్య పెట్టిన గడువు రోజుకు డబ్బు తెచ్చి బాకీ తీర్చేశాడు.

ధర్మయ్యకు పొరుగున సుబ్బయ్య అనే తెలివిలేని ధనికుడు ఉన్నాడు. సుబ్బ య్యకు ధనాశ మెండు. వడ్డీ వ్యాపారం చేస్తే బాగా సంపాదించ వచ్చునని ఆయనకు తెలుసు. కాని బాకీలు వసూలు చేసుకునే చాకచక్యం ఆయనకు లేదు. ధర్మయ్య దగ్గిర ఆ విద్య నేర్చుకోవాలని ఉండేది ఆయనకు. కాని ధర్మయ్య తనకా రహస్యం చెబుతాడని

25-ఏళ్ళనాటి చందమామ కథ



ఆయనకు నమ్మకం లేదు. అది వ్యాపార రహస్యం గద!

దీన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తూండగా కొంత కాలం పోయాక సుబ్బయ్యకు ఉన్న ట్టుండి ఒక ఆలోచన వచ్చింది. ధర్మయ్య బాకీ వసూలు చేసుకునే పద్ధతి తెలుసు కోవాలంటే, తానే అయన దగ్గిర బాకీ చెయ్యాలి! ఇంత చిన్న ఆలోచన తనకు ఇంత కాలమూ తట్టనందుకు సుబ్బయ్య ఎంతో విచారించి, ఆ రోజే ధర్మయ్య వద్దకు వెళ్ళి, వంద వరహాలు అప్పుగా అడిగాడు.

ధర్మయ్య ఆశ్చర్యపోతూ, ''నేను మీకు అప్పివ్వడమా?'' అన్నాడు.

''సమయానికి చేతిలో రొక్కం లేని సమయంలో అనుకోకుండా ఈ ఖర్చు నా నెత్తి మీద పడింది. మీరు తప్ప మరెవరూ ఈ సమయంలో ఆదుకునే వాళ్ళు లేరు. పై నెలలో మీ సొమ్ము మీకు తిరిగి ఇచ్చేస్తాను,'' అన్నాడు సుబ్బయ్య.

ధర్మయ్య ఒక క్షణం ఆలోచించి, ''సరే, అలాగే ఇస్తాను,'' అని లోపలికి వెళ్ళి, నూరు వరహాల రొక్కంతో పాటు ఒక రాయి కూడా తెచ్చి, ''ఒక్క సారి దీన్ని కళ్ళు మూసుకుని తాకండి,'' అన్నాడు.

సుబ్బయ్య ఆశ్చర్యపోతూ, ''ఎందుకు?'' అన్నాడు.

''ఊరికనే! మరేంలేదు,'' అన్నాడు ధర్మయ్య నవ్వుతూ.

సుబ్బయ్య ఆ రాయిని తాకి వంద వరహాలు తీసుకుంటూండగా, ''వడ్డీ నెలకు రెండు వరహాలవుతుంది,'' అని ధర్మయ్య అన్నాడు.

తనకు హెచ్చు వడ్డీ చెబుతున్న సంగతి సుబ్బయ్య గ్రహించాడు. అయినా తన ఉద్దేశం ధర్మయ్య వ్యాపార రహస్యం తెలుసు కోవటం గనక అయన మాట్లాడకుండా ఆ డబ్బు తీసుకుని సంతోషంగా ఇంటికి వెళ్ళి పోయాడు.

నెలలు గడిచినా వారిద్దరి మధ్యా ఆ డబ్బు ప్రసక్తి రాలేదు.

సుబ్బయ్య ఓపికగా అయిదు నెలలు చూశాడు. ధర్మయ్య బాకీ గురించి అడుగు తాడేమోనని. కాని అలా జరగకపోయే సరికి

ధర్మయ్య ఆ బాకీ మాట మరిచిపోయాడని పించింది సుబ్బయ్యకు. ఇక ఆగలేక ఒక నాడు తానే ధర్మయ్య దగ్గిరికిస్వయంగా వెళ్ళి, ‘‘ఇంతకాలమైనా, మళ్ళీ నన్ను బాకీ గురించి అడగనే లేదు, మరిచి పోయారా?’’ అని అడిగాడు.

‘‘నేనెందుకు మరిచిపోతాను? ఆలస్య మైన కొద్దీ నాకే లాభం కదా! మీరు తీసుకున్న డబ్బు నుంచి వడ్డీఎక్కువ వస్తుంది,’’ అన్నాడు ధర్మయ్య.

‘‘ఒకవేళనేను బాకీ ఎగవేస్తేనో?’’ అన్నాడు సుబ్బయ్య.

‘‘అలా చేయలేరు. డబ్బు తీసుకునే టప్పుడు నా దగ్గిర ఉన్న రాయిని కళ్ళు మూసు కుని ముట్టుకున్నారు గదా! అది మహిమగల రాయి. దాన్ని అలా ముట్టుకున్న వాడెవడూ నా దగ్గిర బాకీ ఎగవేయలేడు,’’ అన్నాడు ధర్మయ్య.

ఆ రహస్యం తెలియగానే సుబ్బయ్య, ‘‘అదా సంగతీ!’’ అనుకుని, క్షణంపాటు తీవ్రంగా ఆలోచించి, ‘‘అయ్యా, ధర్మయ్య గారూ! కొన్ని బాకీలు వసూలు కాక నానా ఇబ్బందీ పడుతున్నాను. దయవుంచి మీ రాయిని కొంతకాలం నా దగ్గిర ఉంచితే, నా బాకీలు వసూలు చేసుకుని మళ్ళా మీకు ఇచ్చేస్తాను,’’ అన్నాడు.

‘‘దానికేముందీ? నా దగ్గిర రెండు రాళ్ళు న్నాయి. ఒకటి మీకు అమ్ముతాను. ఒక



ఏడాది పాటు మీ దగ్గిర ఉంచుకోండి. పని చెయ్యకపోతే మీకు డబ్బు తిరిగి ఇచ్చేసి, నా రాయి నేను తీసుకుంటాను,’’ అన్నాడు ధర్మయ్య.

సుబ్బయ్య పరమానందంతో, ‘‘రాయి ఖరీదెంత?’’ అని అడిగాడు. ఆ రాయి కొనటం వల్ల తన కేమీ నష్టం ఉండదని తెలుస్తూనే ఉన్నదాయనకు.

‘‘నూట పది వరహాలు,’’ అన్నాడు ధర్మయ్య.

సుబ్బయ్య చప్పున ఇంటికి వెళ్ళి, ఒక సంచీతో తిరిగి వచ్చాడు. ఆయన ముఖం దీనంగా ఉన్నది. ఆయన ధర్మయ్యతో, ‘‘ధర్మయ్యగారూ, సమయానికి ఇంట్లో రొక్కం అనుకున్నంత లేదు. నూటపది

వరహాలు తెచ్చాను. ఇది తీసుకుని ప్రస్తుతానికి రాయి ఇప్పించండి. మీ బాకీ తరవాత తీరుస్తాను,'' అన్నాడు.

''దానికేంలెండి? ఆలస్యమైన కొద్దీ వడ్డీ కూడా పెరుగుతుంది గద!'' అంటూ ధర్మయ్య డబ్బు తీసుకుని, సుబ్బయ్యకు ఆ రాయి ఇచ్చి పంపేశాడు.

రాయి తీసుకున్నాక సుబ్బయ్య ధైర్యంగా ఊళ్ళో చాలా మందిని పిలిచి మరీ హెచ్చు వడ్డీలకు అప్పులిచ్చాడు. పత్రమూ, సాక్ష్యమూ లేకుండా సుబ్బయ్య అందరికీ అప్పులిస్తూ ఉండటం చూసి చాలా మంది, ఎంత హెచ్చు వడ్డీ అయినా లక్ష్యపెట్టకుండా అప్పు కోసం ఎగబడ్డారు. కళ్ళు మూసుకుని రాయి తాకిన వారందరికీ సుబ్బయ్య అప్పులిచ్చాడు.

నెలలు గడుస్తున్నాయి. సుబ్బయ్య దగ్గిర డబ్బులు తీసుకునే వాళ్ళేగాని ఇచ్చే వాళ్ళు కనిపించలేదు. ఏడెనిమిది నెలలు చూసి, ఉండబట్టలేక సుబ్బయ్య, ధర్మయ్యను అడిగేశాడు.

పూర్తిగా ఏడాది అయ్యేవరకూ చూడమన్నాడు ధర్మయ్య.

ఏడాది గడిచిపోయింది. అప్పులిచ్చి సుబ్బయ్య చాలా డబ్బు పోగొట్టుకున్నాడు. ఒక్కడూ డబ్బు సరిగా తిరిగి ఇయ్యలేదు.

సుబ్బయ్య రాయి పుచ్చుకుని కోపంగా వెళ్ళి, ధర్మయ్య ముందు విసిరికొట్టి, ''అంతా పచ్చిమోసం! మీ మాటలు నమ్మి బోలెడు డబ్బు నష్టపోయాను,'' అన్నాడు.

''నా దగ్గిర బాగానేపని చేస్తోందే ఆ రాయి!'' అన్నాడు ధర్మయ్య.

''నా మొహం పని చేసింది! ఏడాది దాటిపోయింది, నా బాకీయే మీరింకా వసూలు చెయ్యలేదు. మీ రాళ్ళలో ఏ మహిమా లేదు,'' అన్నాడు సుబ్బయ్య.

''నా బాకీ వసూలు కాకపోవటమేమిటి? వడ్డీతో సహా వసూలయింది. నేనా రాయిని మీకు ఊరికేనే ఇచ్చాను. మీరిచ్చిన డబ్బు బాకీ కింద జమ వేసుకున్నాను,'' అన్నాడు ధర్మయ్య నవ్వుతూ.








గాఢ నిద్రలో ఉన్న రాణి కలలో విచిత్ర సంగీతం వినిపించింది.

బొంతకాకి పదునైన గోళ్ళు ఆమెకు నిద్రా భంగం కలిగించాయి. ఆమె ఉలిక్కిపడింది.

బొంతకాకి! మహారాజా, వెళ్ళిపొండి!

ఏమిటి సుకన్యా! ఏమయింది నీకు?

ఆ భయంకరమైన కల మళ్ళీ వచ్చింది ప్రభూ! బొంతకాకి...

నీకు హాని తలపెట్టగలవారు శాంతిపురిలో లేరు!

నాకు తెలుసు... అయినా ఈ కలలు... అవి దేన్నో సూచిస్తున్నాయి...

ఆ విషయం గురించి నేను తెలుసుకుంటాను. నన్ను నమ్ము!

అజ్ఞాత యువరాజుగా పెరిగిన ఆర్య, సింహాసనాన్ని ఆక్రమించడానికి కుట్ర పన్నిన సేనాధిపతి వీర సింహుణ్ణి హతమార్చాడు. ఇప్పుడు ఆర్య ధర్మ పరిపాలనలో శాంతిపురిలో శాంతి నెలకొన్నది.



ఇలా ఉండగా ఒకనాడు ప్రధాన సలహాదారు ప్రభాకరుడు రాజును చూడవచ్చాడు.












మరునాడు శాంతిపురికి ఒక సాధువు వచ్చాడు.

క్షమించండి, మహాత్మా! ప్రభువులు ముఖ్యమైన చర్చలో ఉన్నారు. ఆయన అనుమతి లేకుండా...

వెంటనే నాకు దారి ఇవ్వండి. ఈ క్షణమే రాజును చూడాలి!

శాంతిపురి క్షేమం గురించి పట్టించుకునే నాథుడే లేడా? రాజా, వెలుపలికి రా! నా మాట విను!

ఆయన్ను లోపలికి అనుమతించండి

ఆర్య స్వాగతం చెబుతూ సాధువుకు ఎదురువెళ్ళాడు.

మహారాజు ఏకాంత భవనంలో...

అలా గొడవ చేసినందుకు క్షమించు! నీకో విషయం వెంటనే చెప్పాలని వచ్చాను.

భటులను క్షమించండి మహాత్మా! వాళ్ళ బాధ్యతను మాత్రమే నిర్వర్తించారు!

శాంతిపురికి ఘోర ప్రమాదం ముంచుకురానున్నది! దానిని గురించి హెచ్చరించడానికే వచ్చాను. నీకు కొన్ని దుశ్శకునాలు గోచరించాయి కదా!

దుశ్శకునాలా?



కలలను తీసివేయకూడదు. రానున్న వాటిని వింతరూపాలలో, మార్గాలలో అవి సూచిస్తాయి.
రాణిగారికి వస్తున్న పీడకలల గురించే కదా తమరు చెబుతున్నది? వాటిని గురించి మీకెలా తెలుసు?
తెలుసుకోవడం నా ధర్మం. చర్యలు తీసుకోవడం నీ కర్తవ్యం. రాణిగారి కలలలో శవాల చుట్టూ తిరిగే బొంతకాకి రక్తదాహంతో వస్తున్నది. ప్రభాతపురిలో పిల్లలు కనిపించకుండా పోతున్నారన్న సమాచారం జరుగనున్న ప్రమాదాన్ని సూచిస్తున్నదని నువ్వు గ్రహించావా?
కలలు ఆగేవరకు రాణిగారికి తన బిడ్డను కోల్పోయే ప్రమాదం పొంచి ఉంటుంది!
దయచేసి చెప్పండి, మహాత్మా!
అది జరక్కుండా ఉండాలంటే నన్నేం చెయ్యమంటారు?
అయితే, నువ్వు అడుగుపెట్టడానికి ముందు శాంతిపురిలో జరిగిన వాటిని గురించి తెలుసుకోవాలి!
-(ఇంకావుంది)

# చందమామ
# లోకజ్ఞానం క్విజ్ - 1
(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

## ఈ నెల క్విజ్ సైన్స్‌కు సంబంధించినది

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 1 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఫిబ్రవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. ఏప్రిల్ నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. మిశ్రమలోహం (అలాయ్) తయారీలో ఏ ఏ లోహాలు కలుపుతారు?
2. 'సున్నా'ను సంఖ్యగా ఉపయోగించిన మొట్ట మొదటి విజ్ఞానవేత్త ఎవరు?
3. విద్యుత్‌బల్బ్‌లోని 'ఫిలమెంట్' పోగును ఏమని పిలుస్తారు?
4. సి.ఎస్. కాక్రెల్ దేనిని కనిపెట్టాడు?
5. 'సేఫ్టీ పిన్ను'ను ఎవరు కనుగొన్నారు?
6. పెట్రోలుకు ప్రత్యామ్నాయంగా ఏ రసాయనిక మిశ్రమధాతువును చెబుతారు?
7. రాత్రి ఆకాశంలో తన స్థానాన్ని మార్చుకోని నక్షత్రం ఏది?
8. 'లాఫింగ్ గ్యాస్' విజ్ఞానశాస్త్రం నామం ఏది?

# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :



## నిత్యజీవితంలో విజ్ఞాన శాస్త్రం

పాఠశాలలో మీరు నేర్చుకునే విజ్ఞాన సూత్రాలు నిత్యజీవితంలో ఉపయోగంలో ఉండడం చూడవచ్చు. ఉదాహరణకు మన గ్రామస్థులు పిల్లలకు ఈత నేర్పడం చూడండి. పిల్లల నడుముకు పొడవాటి తాడు కట్టడంతోపాటు వీపులకు సొరకాయ బుర్రలను కట్టి నీళ్ళలోకి వదులుతారు. ఇలా చేయడం వల్ల బోలుగా ఉన్న సొరకాయ బుర్రలు తగినంత తేలే గుణాన్ని ఇస్తాయి. అందువల్ల పిల్లల్ని మునిగిపోకుండా కాపాడుతుంది.

ఇక ఎండాకాలంలో తాగే నీళ్ళను కొత్త మట్టి కడవలో పోసి ఉంచుతారు. కడవలో అసంఖ్యాకమైన సూక్ష్మ రంధ్రాలు ఉంటాయి. వాటి ద్వారా నీళ్ళు నిరంతరాయంగా బయటకు వెళుతూ, ఆవిరవుతూ ఉంటాయి. అందువల్ల కుండ చల్లబడి లోపలి నీళ్ళను చల్లగా ఉంచుతుంది.

ఇక కొయ్యచక్రాలుగల ఎడ్ల బళ్ళను తీసుకోండి. వాటి చక్రాలు ఇనుముతో చేయబడి ఉంటాయి. వాటిని అలా అమర్చడానికి ముందు వడ్రంగులు వాటిని ఎర్రగా కాచి నీళ్ళలో ముంచి కొన్ని నిమిషాలపాటు చల్లబరిచి వెలుపలికి తీసి కొయ్య చక్రాలను బిగిస్తారు. ఇలా చేయడంవల్ల అవి చాలా గట్టిగా బిగుసుకుపోతాయి.



## మన పరిసరాలు

## ఔషధ గుణాలు గల మొక్కలు

ఔషధ గుణాలు కలిగిన ఆగ్లీమార్మిలోస్ అనే విజ్ఞాన వృక్షనామం గల మారేడు గురించి ఈ నెల తెలుసుకుందాం. దీనిని సంస్కృతంలో 'విల్వ' హిందీలో 'బేల్' తమిళంలో 'విల్వం' అని పిలుస్తారు. శివుడికి చాలా ప్రాముఖ్యత గల వృక్షం ఇది. బిల్వ పత్రాలతో అంటే మారేడు ఆకులతో శివుణ్ణి అర్చించడం సంప్రదాయం. ఇరవై నుంచి యాభై అడుగుల ఎత్తు వరకు పెరిగే ఈ వృక్షం సువాసనగల ఆకు పచ్చ-తెలుపు రంగు పూలను పూస్తుంది. నారింజ పరిమాణంలో లేత ఆకుపచ్చ గట్టి బెరడుతో కాయలు కాస్తుంది. పెంకులోపల లేత నారింజ రంగు గుజ్జుతో విత్తనాలు ఎక్కువగా ఉంటాయి. వీటికి ఔషధగుణాలు చాలా ఉన్నాయి. బిల్వ ఫలాలను జీర్ణవ్యవస్థను బాగు చేయడానికి ఉపయోగిస్తారు. దోర మాగిన ఫలాలు విరేచనాలు, రక్త విరేచనాల నివారణకు ఉపయోగపడతాయి. ఆకలినీ, జీర్ణశక్తినీ పెంపొందిస్తాయి. ఆకులు, పళ్ళు, వేళ్ళు యాంటీ బయాటిక్స్‌గా పని చేస్తాయి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


SOURA


SOURA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు ఏప్రిల్ 2009 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్, 2/513,
సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041

## అభినందనలు

డిసెంబర్ నెల పోటీ ఫలితాలు
ముద్దుగుత్తుల తులసీదాస్
జి-1, పావని రెసిడెన్సీ,
8-4-33/21-24
కళింగ ఎన్‌క్లేవ్, ఓల్డ్ బోయినపల్లి
సికిందరాబాదు - 500 011
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: ఆహారం!
రెండవ ఫోటో : ఆహార్యం!!

## సమాధానాలు :

1. రాజారాం మోహన్ రాయ్ 2. డా. అనీ బెసెంట్ 3. 1924 అక్టోబర్ నుంచి 1927 మే వరకు 4. నూర్జహాన్; జహంగీర్ 5. తీర్థంకరులు 6. దక్కనులోని దౌలతాబాద్ 7. పదమూడు 8. జోధాబాయ్ 9. 1959లో 10. సత్యేంద్రనాథ టాగూర్ (రవీంద్రనాథ టాగూర్ అన్నయ్య)

Printed and Published by L. Subramanyan at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : L. Subramanyan

